జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



# ఢిల్లీ దర్బారులో ఉన్నతాసనం!

## ఇంతింతై వటుడింతై నట్లు జాతీయ స్థాయికి ఎదిగిన జనార్ధన రెడ్డి

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి ఉన్న పళాన ఢిల్లీ స్థాయికి ఎదిగి పోయారు. తిరుపతి ప్లీనరీ పుణ్యమా అని జాతీయ స్థాయి రాజకీయాలలో ఆయన మాటకు విలువ, ఆయనకు ప్రాధాన్యత పెరిగాయి. ఢిల్లీ దర్బారులో ఉన్నతాసనం లభిస్తున్నది.

కాంగ్రెస్ పార్టీ అంతర్గత వ్యవహారాలు, వర్కింగ్ కమిటీ సభ్యుల నియామకం వంటి వాటిలో ప్రధానితో సహా పలువురు కేంద్ర నాయకులు ముఖ్యమంత్రితో సలహా పడుతున్నట్లు వార్త. నెహ్రూ కుటుంబం రంగం నుంచి నిష్క్రమించిన తర్వాత ఢిల్లీలో ఎవరికి ఎవరూ నాయకుడు కాని పరిస్థితి ఏర్పడింది. నార్త్ ఇండియాలో, మరీ ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్‌లో కాంగ్రెస్ పార్టీ ఓటమి పాలు కావడం ఈ పరిస్థితికి తోడైంది. ఢిల్లీతో ప్రత్యక్ష సంబంధాలు కల్గిన ఎన్డి తివారి వంటి నాయకులు తెర మరుగైపోయారు. ఉన్న శరద్ పవార్, అర్జున్ సింగ్‌లకు పొత్తు కుదరటం లేదు. ఎమ్పీలలో మెజారిటీ పొందగల్గిన సత్తా వ్యక్తిగతంగా ఎవరికీ లేదు. ఈ పరిస్థితులలో చెప్పుకోదగ్గ సంఖ్యలో ఎమ్పీలు కల్గిన ఆంధ్ర ముఖ్యమంత్రికి సహజంగానే విలువ పెరుగుతుంది. ప్లీనరీ నిర్వహణ ద్వారా, రాష్ట్రంలో ఏడాదిన్నర కాలం నుంచి అసమ్మతిని ఎప్పటికప్పుడు చాకచక్యంగా అణచి వేయడం ద్వారా తన సమర్థతను నిరూపించుకున్న జనార్ధన రెడ్డి పట్ల ఢిల్లీ పెద్దలు ప్రత్యేకాసక్తి కనబరుస్తున్నారు. పార్టీ టిక్కెట్లకో, మంత్రుల తొలగింపుకో చీటికి మాటికి ఢిల్లీకి పరుగులు పెట్టే ధోరణి పోయి, ఢిల్లీ వ్యవహారాలలో సలహాలు చెప్పడానికి పిలుపునందుకునే స్థాయికి ఎదిగి పోయారు జనార్ధన రెడ్డి. ఆర్థికంగా పార్టీని బలోపేతం చేస్తున్న రాష్ట్ర నాయకులలో జనార్ధన రెడ్డి ప్రథముడు కావడం దీనికొక కారణం.

గతవారంలో తల పెట్టిన మంత్రి వర్గ విస్తరణ వాయిదా పడడానికి ఈ పరిస్థితుల మార్పే ప్రేరణ అని చెప్తున్నారు. చెప్పిన మాట వినని మంత్రులను తొలగించే నిర్ణయం తీసుకుంటే అసమ్మతి కేకలకు ప్రాణం పోసినట్లవుతుంది. ఊడిపోయిన వారంతా గొంతు చించుకొని అరచి చీకాకు పెడతారు. మంత్రిత్వాలు రాని వారు సైతం అలుకలు, ఆగ్రహాలతో రచ్చ చేస్తారు. ఢిల్లీలో తన పలుకుబడి పెరిగే సమయంలో రాష్ట్రంలో ఈ న్యూసెన్స్ క్షేమం కాదనే నిర్ణయంతోనే జనార్ధన రెడ్డి ప్రస్తుతానికి మంత్రివర్గ విస్తరణ వాయిదా వేశారంటున్నారు. ఉప ఎన్నికలు ముగిసే వరకు ఇక ఆ ఊసే వుండదని పరిశీలకుల అభిప్రాయం.

తన పట్ల అసంతృప్తితో వున్న వారిని బుజ్జగించే కార్యక్రమం కూడా చేపట్టారు ముఖ్యమంత్రి. అందరితో సర్దుకు పోవడం, శత్రువునూ పలుకరించడం ద్వారా రణశేషం లేకుండా చేయాలనే ఆలోచనలో వున్నారాయనిప్పుడు. ఈ సామదానో పాయానికి ఇటు రాజకీయ వాదులు, అటు అధికారులు సైతం ఆయన వలలో పడిపోతున్నారు. పరిపాలన శబ్దం లేకుండా జరిగి పోతున్నది. సంచలన వార్తలు, సంక్షోభ సన్నివేశాలు లేక పాత్రికేయులు అల్లాడి పోతున్నారు.

ముఖ్యమంత్రిగా జనార్ధన రెడ్డి రాజకీయ విజయ పరంపరలు చూస్తే, వ్యక్తిగతంగా ఆయనెంతటి ఉన్నతి సోపానాధిరో హిస్తున్నదీ అర్థమౌతుంది. ఇంతింతై వటుడింతై, నభోమండల మంత ఎత్తైనట్లు పైకెదిగి పోతున్నాడు జనార్ధన రెడ్డి. అదృష్ట జాతకుణ్ని



ఎవరాపలేరు. దురదృష్ట వంతుణ్ణి బాగు చేయలేరన్న సత్యం జనార్ధన రెడ్డి విషయంలో అక్షర సత్యమౌతున్నది.

* * *

కొరవ 6 పేజీలో

# మునిసిపల్ పెత్తనానికి ఇప్పటి నుంచే ఉర ఉర!

మునిసిపల్ ఎన్నికలు జరుగుతాయన్న అభిప్రాయం బలపడటంతో, టౌన్ రాజకీయ వాడలలో ఉర ఉరలు మొదలైనాయి. అక్టోబరు, నవంబరు ప్రాంతాలలో ఎన్నికలు జరుగ వచ్చునని అంచనా. ఆరు నెలల వ్యవధి వుంది. అయినా చంద్రుడి కోసం చకోర పక్షులవలె ఎదురు చూస్తుండిన టౌన్ నాయకులు ఆ తెర ఖరారయ్యే వరకు ఆగలేక, ఆరాట పడిపోతున్నారు. జిల్లాలోని కావలి, నెల్లూరు, గూడూరు మునిసిపాలిటీలు మూడింటిలోనూ ఇదే పరిస్థితి.

ఎన్నికలతో పాటు, రిజర్వేషన్ల విషయమూ ఇంకా అనిర్ణయం గానే వుంది. ఇప్పుడున్న ప్రకారమే రిజర్వేషన్లు కొనసాగుతాయా, లేక మార్పు చేస్తారా, మార్పు చేస్తే ఏ ప్రాతిపదికన చేస్తారు. 1981 జనాభా లెక్కల ఆధారంగా జరుపుతారా లేక 1991 సెన్సస్ ఫలితాలు వెల్లడయ్యే వరకు ఎదురు చూస్తారా, కేవలం జనాభా ప్రాతిపదిక పైనే జరుగుతుందా లేక రాజకీయంగా నిర్ణయాలు జరుగుతాయా అన్న ప్రశ్నలన్నీ ఇప్పటికీ సమాధానాలు లేనివిగానే వుండి పోతున్నాయి. అన్నిటినీ మించి చైర్మెన్ ఎన్నిక ప్రత్యక్షమా పరోక్షమా అన్నది పెద్ద ప్రశ్న.

> పెండ్లి కొడుకులు భాషికాలు కట్టుకొని తయారౌతున్నారు!

ఎంతటి అనిర్ణయ వాతావరణం నెలకొని వున్నప్పటికీ, మునిసిపల్ సింహాసనం పై ఆశలు పెంచుకున్న వారిలో ఆరాటం, తపన మాత్రం తగ్గడం లేదు.

నెల్లూరుకు సంబంధించి ప్రధానంగా నాలుగు వర్గాలు తమ ఆసక్తిని వెల్లడించేశాయి. జనార్ధన రెడ్డి మొదటి వర్గం. ఆనం వివేకానంద రెడ్డి ఆయనతో కలిసిన ఉపవర్గం అవుతుందనే అప్పటి అంచనా. మాజీ ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి రెండున్నరేళ్ల అజ్ఞాత వాసం నుండి, ముసుగు దుప్పటి ప్రక్కకు తీసి, బయటకు వచ్చేశారు. సివి శేషారెడ్డి గారి

కొరవ 8 పేజీలో

## పినాకినీ తీరం

### నెల్లూరులో ఎవరు?

నెల్లూరు టవున్‌లో ముఖ్య మంత్రి జనార్ధన రెడ్డి వర్గం నాయకుడెవరు? ఆయన విశ్వాసాన్ని చూరగొని, అంతరంగికుడుగా వుండి, గ్రూపుకు నాయకత్వం వహించి, ఆయన శ్రేయస్సును కాపాడ గలిగిన వారెవరు? ఈ పాటికే వున్నారా? లేకుంటే కొత్తగా నియామకం జరగవలెనా? వుంటే ఎవరు? నియామకం జరగవలసి వుంటే ఎవరు?

నెల్లూరు కాంగ్రెస్ రాజకీయాలు, కాంగ్రెస్ నాయకులు కాస్త లోతుగా తెలిసిన వాళ్లు కూడా ఏమి చెప్పదు కురునాథా అనుకోవలసిన పరిస్థితి కల్పిస్తున్నాయి ఈ ప్రశ్నలు. జనార్ధన రెడ్డికి నెల్లూరు టవున్‌లో స్వంత పునాది బొత్తిగా లేదు. 1978 ఎన్నికలలో జిల్లాలో ఇందిరా కాంగ్రెస్ నాయకత్వం చేపట్టే వరకు, ఆయన నెల్లూరీయులకు అనుచరుడు గానే తెలుసు. ఆ తర్వాత నాయకత్వం ఆయనదే. నాయకుడుగా పేరు ఆయనదే గాని, ఆయన సొంత పలుకుబడి, సొంత అనుచర బృందం అంటూ పెద్దగా ఏర్పడలేదు. ఇప్పుడైనా ఆయన హితవో, వీరెవో, అసలేదో నకిలీ ఏదో, విధేయుడెవరో కార్యార్థి ఎవరో గ్రహించి తగిన విధంగా వ్యవహరించ కుంటే, ఈనాటి పరిస్థితి అంత కంటే భిన్నమని నేనను కోను.

జనార్ధన రెడ్డి గారి దురదృష్ట మేమో ఆయన ఎవరినైతే ప్రోత్స హిస్తారో, ఎవరినైతే నెత్తిన పెట్టుకుంటాడో వారే ఆయనకు ఎసురు పెట్టేట్లు తయారవుతున్నారు. స్థానికంగా వున్న నాయకుల మధ్య విభేదా లొస్తున్నాయి; అవి ఘర్షణలుగా మారు తున్నాయి. వాటి చెడు ప్రభావం ఆయన మీద పడుతున్నది; ఆయన ఆరోపణలకు, దురభిప్రాయాలకు గురవు తున్నారు. వద్దంటే ప్రాధేయ పడి ఎలక్షన్ ఖర్చులకు కూడా పది పావులు ఎక్కువిచ్చి నెల్లూరులో ఒకర్ని అభ్యర్థిగా నిలిపారు; ఇందిరమ్మ సానుభూతి పవనం అతడ్ని వీరుణ్ణి చేసింది; ఆ గెలుపు తన సొంత బలమని పొరపడ్డారు; మంత్రిత్వానికి జనార్ధన రెడ్డికి పోటీ పడ్డారు. జనార్ధన రెడ్డి సర్వాధికారియై, పాత అనుభవం మరిచిపోయి, అతనికే నెల్లూరు రాజ్యాన్ని అప్పగించారు; ప్రాధాన్యమిచ్చారు. ఏ పని అడిగితే ఆ పని చేశారు. ఆఖరుకు ఏమైంది? విభేదాలు తప్పలేదు. ఆయనకు విరుగుడుగా మరో గ్రూపును తయారు చేయాలని ప్రయత్నించారు; దాని నాయకత్వం మరో ఎం.ఎల్.ఏ.కి అప్పగించారు. ఆ గ్రూపు టవున్‌లో ఏ మాత్రం స్థానాన్ని పొందలేకపోగా, ఆ ఇద్దరు శాసన సభ్యులు తమ అనుచర బృందంతో పోటా పోటీగా జేజేలు కొట్టించుకొని, మధ్యలో తమ నాయకుడైన జనార్ధన రెడ్డి పేరు మరచిపోయారు. అప్పుడే జనార్ధన రెడ్డి గారు ఒక ఎస్.సి. నాయకుణ్ణి ప్రవేశ పెట్టారు, పెద్దజేశారు. యూత్ కాంగ్రెస్ కొత్త గిత్తలను జత చేశారు. తనకు వ్యతిరేకి అనుకున్న ఆనం వివేకానంద రెడ్డిని మునిసిపల్ వైస్ ఛైర్మన్‌ను చేసి, స్వయంగా దిన్నరుకు పోయి, పూలమాలా లంకృతుణ్ణి చేసి అభివందనోపన్యాసం గావించి వచ్చాడు. వివేకానంద రెడ్డి ఆనాడు ఆయన మనోగతాన్ని అర్థం చేసుకోలేక పోయారు; ఇందరిని దగ్గరకు తీసు కోవడానికి ప్రయత్నించినా, ఇందరిని ఇంతగా ప్రోత్సహించినా, ఇందరికి ఇంతగా చేసినా కాంగ్రెస్ ప్రభుత్వం పడి పోయే నాటికి జనార్ధన రెడ్డి వర్గమంటూ ఒకటి దృఢమైంది ఏర్పడలేదు. తన మనిషి అని చెప్పు కోగలిగిన వాడు ఆనాటికి మిగల లేదు.

అధికారంలో వున్నప్పటికంటే అధికారంలో లేని ఏడేళ్లలో, అసలు వెంకటగిరి టికెట్ కూడా రాని 1985 తర్వాత, ఆయన కొత్త భవిష్యత్తుకు, పార్టీ సేవాపరమైన, ప్రజాసాన్నిహిత్యమైన, వాస్తవిక దృష్టితో కూడిన కార్యక్రమాలను విస్మృత పుణ్యాల భవిష్యత్తుకు ప్రతిజ్ఞ పూనినట్లు పనిజేశారు. జిల్లా ఆ చివరి నుండి ఈ చివరి వరకు కాంగ్రెస్ సేవకులను చైతన్య వంతం చేశారు. శాశ్వతంగా గుర్తుండి పోయే పనులు ఎన్నో చేశారు. ఇందిరాభవన్ నిర్మాణం, వుప్పు సత్యాగ్రహ పునఃప్రదర్శనం వంటివి పేర్కొన దగినవి. జి.ప్ర.స మండల

కొరవ 10 పేజీలో

# జమీన్‌రైతు

## పట్నాయక్ అరెస్టు

ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి శ్రీ జెబి పట్నాయక్‌ను ఆ రాష్ట్ర ప్రభుత్వం అరెస్టు చేసింది. అధికారంలో వున్నపుడు ఆదాయానికి మించి ఆస్తులు సంపాదించారని, అవినీతికి పాల్పడినాడనే ఆరోపణతో ఆయన్ను విజిలెన్స్ అధికారులు అరెస్టు చేశారు. ఆయన మంత్రి వర్గంలో పనిచేసిన నిరంజన్ పట్నాయక్, శ్రీ రామచంద్ర ఉళ్కళ అనే యిద్దరు మంత్రులను సైతం ఇదే చట్టం క్రింద అరెస్టు చేశారు.

అవినీతి ఆరోపణ పై రాజకీయ నాయకులకు అర దండాలు వేయడం చాలా సాహసోపేతమైన రాజకీయ నిర్ణయం. జనతా ప్రభుత్వం ఇందిరా గాంధిని జైలులో పెట్టి ఎంతటి శిక్షకుగురైందో తెలిసిందే! అయితే ఇందిరా గాంధీ అరెస్టుకు దారి తీసిన పరిస్థితులు వేరు – జెబి పట్నాయక్ అరెస్టుకు కారణం వేరు. ముఖ్యమంత్రి గా ఆయన అవధులు లేని అవినీతికి పాల్పడ్డాడని అధికారంలో వున్నపుడే ఆరోపణలు వచ్చాయి. స్వంత పార్టీ వారే విమర్శలు గుప్పించారు. జనతాదళ్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే ఆయన ఇంటిపై దాడి జరిపి, అపార ధనరాశులున్నట్లు కనిపెట్టింది. ఇప్పుడు అరెస్టు చేసింది.

భారత దేశంలో అవినీతికి పాల్పడని ముఖ్యమంత్రి, ఆ మాటకొస్తే రాజకీయ నాయకుడే లేడు. ఎవడికి చేతనైన రీతిలో వాడు, ఎవడికి నచ్చిన పద్ధతిలో వాడు దోచుకొని తినడమే రాజకీయ పరమ ధర్మమై పోయింది. ప్రధాని నుంచి పంచాయితీ సర్పంచ్ వరకు ఇదే ధోరణి. కాని రాజకీయ నాయకుల అవినీతికి చట్టంలో శిక్ష లేనట్లే వ్యవహరిస్తున్నారందరూ ! కోట్లకు కోట్లు ముడుపులు తీసుకొని అక్రమ పనులకు పాల్పడ తున్నారని తెలిసినా, స్వపక్ష సభ్యులు, ప్రతిపక్షాలూ స్పష్టమైన ఆధారాలతో ఆరోపణలు చేసినా, పత్రికలలో చదువుకొని ఔరా అనుకోవడం తప్ప, ఏ నాయకుడినీ ఏ చట్టమూ ఏమీ చేయలేకున్నది. పది రూపాయల లంచం తీసుకున్న పాపానికి తాలూకాఫీసు జవానును కోర్టుకీడ్చి, ఉద్యోగం ఊడబెరికి, మానసికంగా యాతన పెట్టి, హింసిస్తారు కాని; ఒక ముఖ్యమంత్రి పది కోట్లు లంచం తిన్నట్లు తెలిసినా ఎవరూ ఏమీ చేయరు, చేయాలని అనుకోరు.

పదెకరాల రైతు కూడా కాని వాడు, ఎమ్మెల్యే కాగానే మంత్రిత్వం స్వీకరించగానే లక్షలు, కోట్లు ఆర్జించ గల్గుతున్నా, ఆస్తులు కొంటున్నా అడగడానికి ఎవరికీ అధికారం లేదు! అందువల్లే నాయకులంతగా బరితెగించి పోతున్నారు; పబ్లిక్‌గా దోచుకుంటున్నారు; ఫైలు ఫైలుకీ రేటు పెట్టి దండుకుంటున్నారు; ఎవరెన్ని ఆరోపణలు చేసినా, పత్రికలలో, ఎంత ప్రచారం జరిగినా పట్టించు కోకుండా పెత్తనంతో కొనసాగ గల్గుతున్నారు. తమ అవినీతి సర్వసాధారణ రాజకీయావసర మన్నట్లు ప్రవర్తిస్తున్నారు.

ఒక అధికారి తప్పు చేస్తే దండించడానికి చట్టం వున్నపుడు ఒక మంత్రి చేసే తప్పుకు ఎందుకు శిక్ష వుండ కూడదు? జపాన్ ప్రధానిని అవినీతి ఆరోపణలపై న్యాయ స్థానం ఎదుట నిలబెట్ట గలిగినపుడు ఒక ముఖ్యమంత్రిని పోలీసు లెందుకు అరెస్టు చేయకూడదు? రాజకీయ నాయకుడు చట్టానికి అతీతుడైన వ్యక్తిగా ఎందుకు భావించాలి? మూక బలంతో, రాజకీయ కక్ష సాధింపు అనే బ్రహ్మాస్త్రంతో వారు తమను తాము రక్షించు కొంటుంటే సమాజం చూస్తు వూరుకోవాలా? ఆరోపణ వచ్చినపుడు ముఖ్యమంత్రి అయినా, కేంద్ర మంత్రి అయినా న్యాయస్థానం ఎదుట నిలబడి తమ నిర్దోషిత్వం నిరూపించకోవచ్చు కదా? రాజకీయ కక్ష అయినదీ, నిజమైన నిందారోపణ అయినదీ తేల్చే బాధ్యతను న్యాయస్థానాలకు వదలి పెట్ట వచ్చు కదా?

ఏది ఏమైనా బిజూ పట్నాయక్ తీసుకున్న నిర్ణయం అభినందనీయమైనది. రాజకీయ వాదుల అవినీతి నివారణకు ఎవరో ఒకరు ఏదో ఒక స్థాయిలో ప్రయత్నం ప్రారంభించడం ఆహ్వానించ దగిన పరిణామం. నిజంగా జెబిపట్నాయక్ నిర్దోషి అయితే ప్రజలు ఆయనకు తిరిగి పట్టం కడతారు; ప్రజాధనం భోక్త అని తేలితే శాశ్వతంగా తిరస్కరిస్తారు.

అసలు ప్రభుత్వోద్యోగులకు వలె, ప్రభుత్వ నేతలకూ నియమ నిబంధనలు, ప్రవర్తనా నియమావళి రూపొందించి, వారి తప్పులకూ న్యాయస్థానంలో శిక్ష పడేటట్లు ఒక సమగ్ర చట్టం తేవలసిన అవసరం వుంది. అవినీతి, ఆశ్రిత పక్షపాతం, అక్రమ నిర్ణయాల ద్వారా ప్రభుత్వ ఖజానాను నష్టపరిచే వారిని శిక్షించేందుకు, ప్రశ్నించేందుకు చట్టం వున్నపుడే రాజకీయాలలో అవినీతి కాలుష్యం తగ్గుముఖం పడుతుంది. అవినీతి పరుడైన రాజకీయ వాదులను అరెస్టు చేయాలనే నిర్ణయం తీసుకుంటే, దేశంలో జైలు బయట వుండే నాయకుడు ఒక్కడూ మిగలడేమో!

---

# జమీన్‌రైతు

**8.5.1942**
**8 పేజీలు అణా**

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు గలాటాలు

...ండా వీధిలో పడమర కోట మిట్టవైపు 4తేది రాత్రి రెండు మహమ్మదీయుల పాకలు తగుల బడినవి.

యద్లవారి వీధిలో కొయ్యపని చేసే ఒక ముస్లిం యింటిని 5,6 రోజుల క్రిందట తగులబెట్టగా అప్పుడే ఆర్పారనీ, ఆక్రోధంతో వకీలు బి.రామ స్వామయ్యగారి టైపిస్టు రామస్వామిని రౌడీలు 4తేది కొట్టారనీ, ఈ సందర్భంలో నల్గురు హిందువులను అరెస్టు చేశారు.

జయభారతి హోటలుకు 6తేది రాత్రి ఎవరో రౌడీలు వచ్చి కుర్మాలేదంటే తగువు బెట్టుకొని పోయి ప్రొద్దుపోయి కొందరు వచ్చి హోటలు సంబంధీకుల్లో ఒకర్ని పొడిచి, యిద్దర్ని కొట్టి పొయ్యారు. బ్లాకౌటు కటిక చీకటి ఎవరిని పోలుస్తుంది? ఇది మత సంబంధం గాదులెండి!

### కడపటి వార్తలు

మెడగాస్కరులో ఫ్రెంచి వారు ప్రతిఘటన వదులుకున్నారు. వుత్తరపు ప్రక్క నౌకాశ్రయాన్ని ప్రధాన పట్టణాన్ని, బ్రిటిషువారు పట్టుకున్నారు.

బర్మా రోడ్డుకు ఉత్తరంగా 25 మైళ్ళు చీనాలోకి జపానువారు చొచ్చుక పోయారు.

### మాచర్లవారిపాళెం

ఎక్కడ సుఖ ముంటుదో, అక్కడ దుఃఖముంటుంది. ఎక్కడ వెల్తురుంటుందో, అక్కడ చీకటుం టుంది. ఎక్కడ భాగ్యముంటుందో, అక్కడ దరిద్రముంటుంది. అందుకిదే నిదర్శనం :-

మావూళ్ళో ధన ధాన్యాలకు లోటులేదు. అందరూ యింత మజ్జిగన్నం తినేవాళ్ళే. కావున బ్రతికున్నంత వరకు ఏమీ ఫర్వాలేదు గాని, వర్షాకాలంలో ఎవరన్నా చచ్చారంటే, వాళ్ళగాడు వచ్చింది: మేమంతా చచ్చిన వాళ్ళమే. చచ్చిన శవాన్ని గొంతులోతు నీళ్ళల్లో తీసుకపో వలసిందే. ఈ కష్టనివారణ మార్గమెట్లా? పంచాయితీ బోర్డు వైస్ ప్రెసిడెంటు గారు పిలోర్చుకొని డబ్బు తీసుకొని అయినా జానెడు దారి యిచ్చారా బ్రతికిన వాళ్లమే. లేకుంటే ఎట్లా ఈ నరకబాధ నుండి తప్పించుకొనేది? కోదండయ్యా ! మీరు ప్రెసిడెంటుగా వుండగానే మాకీ యమలోకపు బాధ తప్పిస్తే తిర్నిక పెట్టు దణ్ణం పెట్టుకొని కొంటామయ్యా!

పారుడు.

### చల్లాయపాళెం

"పంతులవారికి. ఆయనాడి వాణ్ణి చచ్చేట్టు పడంగాలేపంగా కొట్టేఅధికారం గూడా సర్కారువారు యిచ్చారా?" అని గత 18తేది పెనుబల్లి రోడ్డు 1-మైల్లో ఎవరో యిద్దరు వితర్కించు కొంటుండినారే ఎక్కడిదీ రహస్య మర్దనం ?

---బాటసారి.

### కళ్ళు కాళ్ళు వున్నవా ?

నెల్లూరు ట్రంకురోడ్డులో పోతూంటె రోడ్డు మీద పోవద్దు ప్రక్కన ప్రత్యేకంగా కట్టివుంది (Foot Path)ఫ్లాట్ ఫారం మీద నడువు అని దబాయిస్తాడు పోలీసు ఆయన. ఫ్లాట్ ఫారమ్ మీద కాలు పెట్టేందుకు సందే వుండదు. ఫ్లాట్ ఫారం సన్నగా, అంగళ్ళ సామగ్రి అంతా విక్కగా వున్నది. మరి నన్ను యిట్లా పొమ్మంటాడో ట్రంకురోడ్డు అధిదేవత ఈ పోలీసాయన.

ఒక దినం బాలిరెడ్డి పాళెం నుండి బస్సులో వస్తుంటె బూదనం వద్ద చీలు రోడ్డు కాడ పారుద్రవు ఆ బొగ్గు బస్సు ఆగిపోయింది. తర్వాత సంగతేమిటయ్యావి కండక్టరునడిగితే నడిచి పొమ్మన్నాడు. టిక్కెట్టులో కొరవ డబ్బేంది వేరే బస్సెక్కతాము అని అడిగితే, 'అదంతా దాగానహి' అన్నాడు. మరింకేమన్నాఅంటే దేహశుద్ధి జేతుందేమోననే భయంతో బ్రతుకుజీవుడా అని కాలికి బుద్ధి జెప్పినా. ఇట్లాజేస్తె నడవను శక్తి, చేతిలో డబ్బులేని కుంటి - గుడ్డివారల సంగతి యేమి కావాలి?

---బాటసారి.

★★★★

---

# మల్లప్ప కాల్వ మురుగు నుంచి నెల్లూరుకు విముక్తి రాదా?

నెల్లూరులో ఉయ్యాల కాలువ, మల్లప్ప కాలువలపై శ్లాబ్ పోయించి, నెల్లూరు కుండిన మురుగు నీటి రూపాన్ని తొలగించి, నూతన శోభ కల్పించి పోయారు స్వర్గీయ ఏసి సుబ్బారెడ్డి గారు. ఇప్పుడు మల్లప్ప కాలువకు ఎందువల్లనో పదే పదే పూడిక తీయవలసి వస్తున్నది. సంవత్సరాని కొకసారి వేలు వ్యయ పరచి మల్లప్ప కాలువలోని పూడికను తీసి, ఆ మట్టి అంతా ఆ కాలువ వద్దనే పోస్తున్నారు. క్రమేణా, ఒకటి రెండు నెలలలో అదే మట్టి మళ్లీ అదే కాలువలో చేరి పోతున్నది. కాలువపై అక్కడక్కడా ఓపెనింగ్‌లు వున్నాయి. వాటిని ఇళ్లలోని వారు, హోటళ్ల వారు డస్టబిన్‌లుగా వాడుకుంటున్నారు. పుల్లాకులు మొదలు సకలసబ్బందు చెత్తా ఆ కాలువలలో క్రుమ్మరిస్తున్నారు. అవి కుళ్లి కంపు కొట్టడంతో పాటు కాలవలో నీటి ప్రవాహాన్ని ఆటంక పరుస్తున్నాయి. దీన్ని పట్టించు కునే వారే లేరు. ఏడాదికొకసారి పూడిక తీసి, తిరిగి పూడ్చే బదులు – తీసిన మట్టిని, దూరంగా తోలించి, ఓపెన్‌గా వున్న ప్రదేశాలను మూసివేస్తే కాలువ బాగుపడుతుంది కదా?

– కె. లక్ష్మి కాంతశర్మ
నాగమాంబాపురం

**జనవాణి**

### రాష్ట్రపతి అభ్యర్థి

రాష్ట్రపతి అభ్యర్థిత్వంపై జరుగుతున్న చర్చలపై జమీన్‌రైతు సంపాదకీయం (ఏప్రెల్ 10) సజీవంగా వుంది. ఉత్తముడైతే, హరిజనుడైనా, గిరిజనుడైనా, దళితుడైనా, మరెవరైనా రాష్ట్రపతి పదవికి అర్హుడే! రాష్ట్రపతి పదవికి ముఖ్యమైనది – అర్హత; కులము, మతము కాదు. ఈ వాస్తవాన్ని ప్రజలు, రాజకీయ పార్టీలూ గ్రహించాలి.

ఈ పదవికి శంకర్ దయాళ్ శర్మ అన్ని విధాలా అర్హుడు. నీతి పరుడు, మేధావి, దేశభక్తి, దైవశక్తి గల వాడు ప్రతిభావంతుడు, సాంప్రదాయం ప్రకారం ఉపరాష్ట్రపతిగా వున్నవారే

కొరవ 8 పేజీలో

# స్వాగత ద్వారాలతో రోడ్లు సర్వనాశనం!

జోనల్ ట్రాఫిక్ అధ్వాన్నంగా వుందని అందరూ ఆక్షేపించే వారే. పాదచారుల మొదలు వాహనా రూఢుల వరకు అందరూ రోడ్లను తిట్టారు. రోడ్ల వెడల్పు చాలదం లేదనేది వలువురి అభిప్రాయం. అందువల్లే రోడ్ల ప్రక్క నుంచే ఆక్రమణలు. ఇళ్ళు, అంగళ్ళు పగలగొట్టి రోడ్లు వెడల్పు చేయమన్నిస్తుంటారు మునిసిపాలిటీ వారు. అయితే ఈ ఆక్రమణలకంటే రాజకీయ నాయకులు కట్టే స్వాగత తోరణాలు రోడ్లను, ట్రాఫిక్‌ను ఎక్కువగా నష్టపరుస్తున్న విషయం ఎవరూ సీరియస్‌గా తీసుకోవడం లేదు.

ఏ ప్రెసిడెంటో, ముఖ్యమంత్రో వస్తున్నారని రాత్రికి రాత్రి యుద్ధ ప్రాతిపదిక మీద రోడ్లు వేస్తారు. ఒక ప్రక్క రోడ్డు వేస్తూంటే మరొక ప్రక్క అదే నాయకులకు స్వాగతం చెప్పడానికి వేసిన తారు ఆరక ముందే అదే రోడ్లను త్రవ్వి, గుంటలు చేసి స్వాగత తోరణాలు కట్టడం మొదలు పెడుతున్నారు. ఈ ద్వారాలు పూడదీసిన తర్వాత ఆ గుంటలు బాగు చేసే దిక్కు వుండదు. పొరపాటున ఆ గుంటలో

**తిక్కవరపు కోదండరామ రెడ్డి (ఇంజనీరు)**

కాలుపడితే పుత్తూరే దిక్కు. ఆ గుంటల్లో క్రమంగా రోడ్లోని మట్టి వచ్చి చేరుతుంది. వర్షం వచ్చినపుడు ఆ గుంటలలో నీరు చేరి, రోడ్డు అడుగు భాగానికి నెమ్ము ఎక్కి, రోడ్డు పునాదులు కదిలిపోతాయి. పెచ్చులు పెచ్చులుగా తారు పూడిపోయి రోడ్డు సర్వ నాశన మౌతుంది.

పెద్ద నాయకులు వచ్చినపుడు ఛోటా నాయకులు తమ భక్తి ప్రపత్తులు చాటుకోవడానికి ఏదైనా చేయవచ్చు కాని, పబ్లిక్ రోడ్లను ఇట్లా పాడు చేయడం అనాగరిక పద్ధతి కాదా? స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి గారు కొన్ని దశాబ్దాల పాటు నిలిచేటట్లు వేసిన స్టోన్‌హౌస్‌పేట సిమెంట్ రోడ్డునూ గుంటల మయం చేస్తున్నారు. ఇతర విషయాలలో ఒకరి మీద ఒకరు కత్తులు దూసుకొనే వివిధ పార్టీల నాయకులందరూ రోడ్లు పాడు చేసి స్వాగత ద్వారాలు కట్టడంలో మాత్రం ఒకటౌతున్నారు.

కొరవ 11 పేజిలో

డోలేంద్ర → **సణుగుడు**

## పుట్టగొడుగుల్లా పుట్టుక వస్తున్న ఫైనాన్స్ కంపెనీలు ప్రజలనుఎప్పుడో ముంచుతాయి, జాగ్రత్త!

పూర్వం స్వల్ప కాలంలో సంపన్నులు కావడానికి ప్రభుత్వాన్ని మోసం చేసేవారు. కాంట్రాక్టుల ద్వారానో, దొంగ క్లెయిముల ద్వారానో, స్మగ్లింగ్ ద్వారానో, లైసెన్సులు, పర్మిట్లు సంపాదించి, అమ్ముకొనడం ద్వారానో రాత్రికి రాత్రి లక్షాధి కారులయ్యే వారు. ఇప్పుడు అడ్డదారిలో అగర్ర శ్రీమంతులుగా గుర్తింపబడడానికి అమాయక ప్రజలను వంచించడం కంటే ఉత్తమ మార్గం మరొకటి కన్పడడం లేదు. పబ్లిక్ లిమిటెడ్ కంపెనీల ద్వారా పబ్లిక్ మనీని సేకరించడం ఎంత సులభ తరమైన మార్గమో కళ్ళముందు కన్పడు తూనే వుంది. షేర్ల మార్కెట్‌లో మాయాజాలం సృష్టించడం ద్వారా వందలాది కోట్లు ఆర్జించిన హర్షద్ మెహతా కథ విలవలు వలవలుగా వింటున్నాం. అవన్నీ పెద్ద పెద్ద తిమింగళాల వ్యాపార క్రీడలు. స్థానికంగా, టౌన్లస్థాయిలో రియల్‌ఎస్టేట్ వ్యాపారులు ప్రజలను అందమైన, ఆకర్షణీయమైన ప్రకటనల ద్వారా ఆకర్షించి యాభై అరవై ఏళ్ళకు సైతం ఇళ్ళు కట్టడానికి పనికి రాని నిర్జన ప్రాంతాలలో ప్లాట్లు అమ్ముకుంటున్నారు. ఈ మధ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం ఎంత మోసపూరితంగా తయారైందంటే స్థలం లేకుండానే కాగితాలపైన అమ్మకాలు జరిపేస్తున్నారు. ఐదో,పదో, ఎకరాలు కొనడానికి అడ్వాన్సు చెల్లించి, అగ్రిమెంట్ వ్రాయించుకుంటారు;బోర్డు తగిలిస్తారు. రెండువందల వేల ప్లాట్లు వున్నట్లు ప్రకటిస్తారు. ఆ ప్రచారం చూసి అమాయక జనం అక్కడేదో పెద్ద టౌన్‌షిప్ అభివృద్ధి అవుతుందని భ్రమపడి ఎగబడి కొంటారు. ప్రజల నుంచి పూర్తిగా డబ్బు చేతికందిన తర్వాత నిజంగా పొలాల కొనుగోలు ప్రారంభమౌతుంది. వాటికి టౌన్ ప్లానింగ్ అప్రూవల్ వుండదు. రోడ్లు, లైట్ల వంటి వసతులసలే వుండవు;దారి డొంక లుండవు. కనీసం యాభైఏళ్ళపాటు అక్కడ ఇళ్ళు కట్టుకునే వీలుండదు. రియల్ ఎస్టేట్ కంపెనీ వ్యాపారం మాత్రం కోట్లలో వుంటుంది.

ఇళ్ళ ప్లాట్లయినా కొంతనయం. మంచిదో, చెడ్డదో పదడుగుల నేలైనా వుంటుంది. ఫైనాన్స్ పథకాల పేరుతో ప్రజలను హిప్నటైజ్ చేస్తున్న వడ్డీ వ్యాపార కంపెనీల పథకాలు మరీ దారుణంగా వున్నాయి. నెలకు వంద లెక్కన 20నెలలు కడితే, ఆతర్వాత 60నెలలకు రెట్టింపు మొత్తం ఇస్తారట. కొంచెం అటు ఇటుగా ఇటువంటి స్కీం తోనే నెల్లూరులో దాదాపు వంద కంపెనీలు పుట్టగొడుగుల్లాగా పుట్టుకొని

కొరవ 10 పేజిలో

# చేపలతో కోళ్ళు, బాతులు కలిపి పెంచితే అధికాదాయం

**ప్రొఫెసర్ పి.ఎస్. రావు**
**పి. ఆచార్య**
**బొంబాయి**

గతవారం కొరవ

### వరి చేలల్లో చేపల పెంపకం

వరి పైరుతో పాటుగా చేపల పెంపకం చేపట్టడం, కేరళ, పశ్చిమ బెంగాల్ వంటి రాష్ట్రాలలో జరుగు తున్నది. పశ్చిమ బెంగాల్ వంటి రాష్ట్రాలలో చేపలు, వరి కలిపి ఒకేసారి సాగుచేస్తారు; కేరళ, కర్ణాటకలలో వరి పండించే కయ్యలలోనే చేపల పెంపకమూ జరుగతున్నది. కాండం పొడవుగా వుండే వరి రకాలు, ఇండియన్ మేజర్ కార్ప్, కామన్ కార్ప్ చేపలు ఈ విధానంలో ఎంపిక చేసుకోవాలి!

కయ్యలో గట్ల అంచునా, మధ్య మధ్యలో లోతైన కాల్వలు త్రవ్వుతారు. నీరు వదిలేటప్పుడు కయ్యలోకి కలుపు చేపలు, ఇతర నీటి జీవులు ప్రవేశించ కుండా వల కడతారు. తర్వాత చేప పిల్లలను వదలుతారు. చేపలకు, వరి కయ్యలలోని పురుగులు, కీటకాలే ఆహారం. దీని వల్ల కీటకాల ద్వారా వరిని ఆశ్రయించే తెగుళ్లను నివారించే వీలుంటుంది. చేపలు విసర్జించే వ్యర్థ పదార్థాలు వరికి ఎరువుగా పని చేస్తాయి. వరి కోతకు వచ్చే సమయంలో నీటి మట్టం తగ్గించి, కాలువలలో మాత్రం నీళ్ళుండేట్లు చూస్తారు. ఈ పద్ధతిలో ఎకరాకు ఏడు వేల రూపాయల అదనపు ఆదాయం పొందిన రైతులూ వున్నట్లు తెలిసింది.

చాలా రాష్ట్రాలలో వరి కోతల తర్వాత స్వల్పకాలంలో పెరిగే చేపలు, రొయ్యల పెంపకం చేపట్టడం ఆనవాయితీగా మారింది.

### 'బాసా బాదా' కల్చర్

పశ్చిమ బెంగాల్‌లో బాసాబాద్ కల్చర్ పద్ధతి విస్తారంగా ఆచరణలో వుంది. సముద్రపు ఆటుపోట్లకు లోతు భూములలోకి నీరు ప్రవేశించే ప్రాంతాలలో ఈ పెంపకం చేపడతారు. ఆటుపోట్లకు వచ్చే నీటితో పాటు చిన్న చిన్న చేపలు కయ్యలలోకి వచ్చేటట్లు ఇన్‌లెట్ గేట్లు బిగిస్తారు. లోపలకు వచ్చే చేపలు తిరిగి బయటకు పోలేని ఏర్పాటు వుంటుంది.

### మురుగు నీటి చేపలు

పరిశ్రమలు వదలి పెట్టే కలుషిత జలాలను శుద్ధిచేసి తిలాపియ చేపలు పెంచడం ఒక పద్ధతి. వీటిలో ఇండియన్ మేజర్ కార్ప్ చేపలను కూడా పెంచుతున్నారు. ఈ నీటిలో హెచ్చు పరిమాణంలో పోషక పదార్థాలుండడం వల్ల ప్లాంక్టన్ బూమ్‌తో అధిక ఉత్పత్తి సాధించవచ్చు. ఇటువంటి శుద్ధి చేసిన మురుగునీటి చేపల పెంపకంలో ఇప్పటి వరకు ఎటువంటి చెడు ఆరోగ్య ప్రభావాలూ కన్పడలేదు. కలకత్తా మార్కెట్‌కు ప్రతినిత్యం టన్నుల కొద్దీ ఈ చేపలు వస్తుంటాయి. పెంపకంలో అదనంగా మేత ఏదీ ఇవ్వక పోవడం వల్ల చేపల పెంపకం చాలా చవక!

### చేపలు, కురగాయలు కలిపి పెంచే పద్ధతి

చేపల పెంపకంతో పాటు పండ్లు, కూరగాయలు తదితరాలను కలిపి పెంచే పద్ధతి దక్షిణాసియా దేశాలలో విస్తారంగా ప్రాచుర్యం పొందుతున్నది. చేపల పాండ్ గట్లపైన కూరగాయల తోటలు పెంచవచ్చు.

చేపల తోపాటు బాతులు, కోళ్లు, పందుల పెంపకం చేపట్టడం ఇంకొక పద్ధతి. నీళ్లపై ప్లాట్‌ఫారం కట్టి బాతులు; పాండు అనుకొని పందులు, కోళ్ళఫారాలు కట్టి, వాటి పెంటె ఆహారంగా వాడి, చవకగా చేపలు పెంచవచ్చు. చిన్న రైతులకు ఇది చాలా లాభదాయకమైన పద్ధతి. తేనెటీగలు పట్టు పురుగులను సైతం చేపలతో కలపవచ్చు. పట్టుపురుగులు చేపలకు బలవర్థక ఆహారంగా పనిచేస్తాయి. ఇటువంటి మిశ్రమ చేపల పెంపకంలో హెక్టారుకు సంవత్సరానికి రూ. 40 వేల ఆదాయం పొందే వీలుంది.

కొరవ 11 పేజిలో

# కొండదారిలో గుడి — గుడినరవ

**ఊరు పేరు**
**వావింటపరి కృష్ణారావు**

జంతువులను పోలిన ముఖములు గల మనుష్యులు చాలా మంది వున్నారు.

తంజావూరును పరిపాలించిన మహారాష్ట్ర శివాజీ వంశస్థుడు, రాజా మహారాజ శరఫోజి (Sarfoji) అటు జంతువుల ముఖాలను యిటు మనుష్యుల ముఖాలను చిత్రీకరించి, ఆయన స్థాపించిన తంజావూర్ సరస్వతీ మహల్ గ్రంథాలయములో ప్రదర్శించినారు.

కోతుల, గుర్రముల, సింహముల, పిల్లుల, గ్రద్దల ముఖ చిత్రములను వేసి వాటి ప్రక్కన కోతి, గుర్రము, సింహము, పిల్లి, గ్రద్దల వంటి ముఖములు గల మానవ ముఖములను చిత్రీకరించి యిద్దరికి సారూప్యత చూపి కళా సేవ చేసి యున్నారు. ఈయన సేకరించిన అమూల్యతాళపత్ర గ్రంథములు యీ గ్రంథాలయములో అనేకములున్నవి. కొండలు, పర్వతాలు ప్రకృతి యిచ్చిన అందాల రాసులు, సహజ సంపదలు. వాటిని కొన్ని చోటుల, కొన్ని కోణములలో పరిశీలించిన ఏనుగు నిద్రించినట్లుగా, తాబేలు పడుకొని తల ఎత్తినట్లుగా, మరి కొన్ని చోట్ల, ఒంటె

కొరవ 10 పేజిలో

# నెల్లూరు బుల్లెట్లు
## విలక్షణుడు

### పెళ్లకూరు అస్పత్రి మార్పు

హృద్రోగ చికిత్సకై మద్రాసు అపోలోలో వుండిన శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి బాగా కోలుకున్నారు. అపోలో నుంచి డిస్చార్జి అయి, మద్రాసులోనే డాక్టర్ పి.ఎం.కె. రెడ్డి అస్పత్రిలో విశ్రాంతి తీసుకుంటున్నారు. అక్కడ నాలుగైదు రోజుల పాటు వుంటారట.

ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు ఎప్పటికప్పుడు పెళ్లకూరు ఆరోగ్యం గురించి వాకబు చేస్తున్నారు. కేంద్ర మంత్రి శ్రీ చింతా మోహన్ ప్రధాని తరపున మద్రాసు వచ్చి పరామర్శించి వెళ్లారు.

అనారోగ్యం వల్ల రేపు 14 తేది ఢిల్లీలో జరుగనున్న ఐ.ఏ.సి. సమావేశానికి పెళ్లకూరు హాజరు కావడం లేదు. అందువల్ల ఆయన ఛైర్మన్‌గా ఎంపికయ్యే కార్యక్రమం మరి కొంత కాలం వాయిదా పడుతున్నది.

### మంత్రులు

గనుల మంత్రి శ్రీ జానకి రాం ఈ రోజు (8 తేది) నెల్లూరు వచ్చారు. నాటకోత్సవాలు ప్రారంభించారు. 9 తేది ఉదయగిరి; 10,11 తేదులలో నెల్లూరు; 12 తేది గుంటూరు.

* * *

వాణిజ్య పన్నుల మంత్రి శ్రీ కె. బాపి రాజు 8 తేది ఉదయం విశాఖ నుంచి మెయిల్‌లో గూడూరు వచ్చి, రైల్వే స్టేషన్ నుంచే కారెక్కి తిరుపతి వెళ్లారు.

* * *

గిరిజన సంక్షేమ మంత్రి శ్రీ కె. భీమ రావు 3 తేది నెల్లూరు వచ్చారు. కొన్ని గిరిజన కాలనీలు సందర్శించారు.

ఎఐసిసి లో దొంగ ఓటు వేసిన మాన్యుడీయనే!

### నంది అవార్డుల ఉత్సవం వాయిదా

మే 25 తేది జరుగుతుందనుకున్న నంది అవార్డుల ప్రదానోత్సవ సభ జూన్ 4 తేదికి వాయిదా పడినట్లు తెలుస్తున్నది; తదనుగుణంగా ముఖ్యమంత్రి కార్యక్రమమూ మారుతుంది.

### సైన్స్ ఫెయిర్‌కు విస్తృత ఏర్పాట్లు

రాజీవ్ గాంధీ స్మరణోత్సవంగా జరుప తలపెట్టిన సైన్స్ ఫెయిర్‌కు చాలా విస్తృత ఏర్పాట్లు చేస్తున్నారు శ్రీ ఆనం వివేకానంద రెడ్డి.

మే 21, 22 తేదులలో వి.ఆర్. హైస్కూలు ఆవరణంలో జరుపబోయే ఈ ప్రదర్శనలో దాదాపు వంద రకాలైన విజ్ఞాన దాయక పరికరాలను ప్రదర్శిస్తున్నారు. అధునాతన కంప్యూటర్లు, రోహిణి రాకెట్ నమూనా, యుద్ధాలలో వాడే భారీ ఓడల బొమ్మలు, మైక్రోస్కోప్ కంప్యూటర్లు, వైర్‌లెస్ రేడియోలు; మెల్టింగ్ మ్యాన్, ఎలక్ట్రానిక్ ఫౌంటెన్ వంటి సైన్స్ ఫాంటసీ నమూనాలు, సోలార్ కార్ తదితరాలు ప్రదర్శనలో వుంటాయి. బయోటెక్నాలజీ, ఎన్విరాన్‌మెంట్ పొల్యూషన్ కంట్రోల్ వంటి అంశాలపై రాజీవ్ గాంధీ ఆసక్తికి అనుగుణంగా వాటికి సంబంధించిన పరికరాలనూ సేకరిస్తున్నారు. పిల్లలకు ప్రత్యేక ఆకర్షణగా ఆ రెండు రోజుల పాటు విదేశీ వీడియో ఫిలింలు వేస్తారు. ప్రతి రోజూ సాయంత్రం సాంస్కృతిక కార్యక్రమాలుంటాయి.

వీటితో పాటుగా, ఆర్ట్ కాంపిటీషన్ వుంటుంది. 21 తేది సాయంత్రం 4 నుంచి 7 గంటల వరకు జరిగే ఈ పోటీలో 'రాజీవ్ గాంధీ - రాజీవ్ గాంధీ భవిష్య ద్దర్శనంలో 21 శతాబ్దం' అన్న అంశంపై పదిహేనేళ్ల లోపు పిల్లలు, పైబడిన పెద్దలకు విడివిడిగా పోటీ వుంటుంది. చిత్రం గీయడానికి అవసరమైన కాగితాలు గీగితాలు అక్కడే ఇస్తారు.

ఔత్సాహికులెవరైనా సైన్సు, పర్యావరణ పరిరక్షణ, ఎలక్ట్రానిక్స్ వంటి అంశాలకు సంబంధించిన పరికరాలు, నమూనాలు, ఫోటోలు ఈ ప్రదర్శనలో పెట్టవచ్చు. వివరాలకు స్కూలులోనే విచారించండి!

సైన్సు ప్రదర్శన నిర్వహించడం కంటె రాజీవ్ గాంధీ స్మరణకు సముచితమైన దేముంటుంది?

కొరవ 6 పేజిలో

### పేజీల సవరణ

క్షణం చిత్రం, క్షణం మాయ అన్నట్లున్న కరెంట్ సరఫరా, అనివార్య సాంకేతిక కారణాల వల్ల ఈ వారం పత్రిక పేజీలు తగ్గించ వలసి వచ్చింది. 9,10,11 పేజీలను 7,8,9 పేజీలుగా; 8 పేజికి చూపిన కొరవలు 6 పేజీలోనూ చదువుకొమని పాఠకులకు మనవి.

— సంపాదకుడు





మా కుటుంబ అభివృద్ధికి మూలకారకుడు మా తాత

**ఆరుగుంట సుందర రామిరెడ్డి గారు**

పరమపదించి 9.5.92 తేదికి సంవత్సరం గడచింది ప్రథమ వర్ధంతి సందర్భంలో వారిని స్మరించుకుంటూ

ఈదల కొండారెడ్డి (ఇంజనీరు) ఇందిర
పల్లవి, శృతి



శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి వారి ఏకోత్తర సహస్ర (1001) కలశాభిషేకం

రంగనాయకుల పేట, నెల్లూరు - 524 001. ఫోన్: 26456

## కృతజ్ఞతాంజలి

తేది 7.5.1992 గురువారం శ్రీ తల్పగిరి రంగనాథస్వామి వారి యేకోత్తర సహస్ర కలశాభిషేకము సందర్భమున భక్తులు, కార్యకర్తలకు, శ్రేయోభిలాషులకు, ఇది వరలో నాలుగు పర్యాయములు సహాయ సహకారములు అందించిన భక్తులు, కార్యకర్తలు శ్రేయోభిలాషులకు కృతజ్ఞతాంజలి తెలియచేయుచున్నాము. వీరికి శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి వారి కరుణా కటాక్షములు ప్రసాదించవలెనని శ్రీ స్వామి వారిని ప్రార్థించుచున్నాము.

ఇట్లు
కె. జగన్నాథాచార్యులు

**ముఖ్యగమనిక** పై మహోత్సవ సందర్భమున చందా చెల్లించిన భక్తులు వారము రోజుల లోపల రశీదు చూపించి మా ప్రసాదమును తీసుకొన వలసినదిగా కోరుచున్నాము.

## జిల్లావార్తలు

10 పేజీ తరువాయి

వాలని, ఎమ్మార్వోకు అన్యవళ్కురలేదని అన్ను పట్టారట. అమినా దాన్ని ఎమ్మార్వోకు మాత్రమే సర్వేచేయాలని పట్టు బట్టడంతో ఘర్షణ జరిగింది. ఎమ్మార్వో కార్యాలయ సిబ్బంది అమినాపై చేయి చేసుకున్నారట. దానిపై వెంకటగిరి బార్ అసోసియేషన్ ప్రతి స్పందించి, ఒక రోజు కోర్టులు బహిష్కరించింది. రెండు పక్షాలవారూ పోలీసు కేసు పెట్టుకున్నారు.

గోటితో పోయేదాన్ని గొడ్డలి వరకు తెచ్చుకోవడమంటే ఇదే కదా?

### బుచ్చి ప్రైవేట్ బస్ – ఆర్టీసి నెత్తిన టోపి!

నెల్లూరు నుంచి బుచ్చిరెడ్డి పాళెంకు ఈ మధ్య కొత్తగా ప్రవేశపెట్టిన ఒక ప్రైవేట్ బస్ ఆర్టిసి ఆదాయానికి గ ండి కొడుతున్నదని ఒక ఆర్టిసి ఉద్యోగి వ్రాస్తున్నారు. ఈ కొత్త ప్రైవేట్ బస్ ఆత్మకూరు బస్టాండు నుంచి నవాబు పేట, శెట్టిగుంట రోడ్డు, వెంకటేశ్వర పురం, పొతిరెడ్డి పాళెంల మీదుగా దామరమడుగు; అక్కడ నుంచి పాటూరు, రేబాల మీదుగా బుచ్చికి వెళ్ళాలట. ఈ రూట్ ప్రకారం మెయిన్ రోడ్డులో కొద్ది దూరం మాత్రమే తిరగాలి! కాని అది నెల్లూరు నుంచి నేరుగా మెయిన్ రోడ్డులోనే తిరుగుతుంది! దాని వల్ల రోజుకు 3వేల వరకు ఆర్టిసి బస్సులు నష్ట పోతున్నాయని అంచనా అట. ఇచ్చిన రూట్‌లో కాకుండా, మెయిన్ రూటులో బస్ తిరిగి నందుకు ఆర్‌టిఓ, ఆర్‌టిసి కార్యాలయాలకు క్రమం తప్పకుండా నెల మామూళ్లు చేరుతున్నాయన్న ఆరోపణ వినవస్తుంది. ఇది నిజమా ?

రెడ్డికి అగ్ని పరీక్ష వంటిది. ఒకటిన్నర ఏళ్ళ పరిపాలన పట్ల ప్రజలు విముఖులు కాలేదని నిరూపించుకోవడానికి ఈ ఎన్నికలే మార్గాంతరం. రాజీవ్ గాంధీ ఆత్మాహుతి పార్లమెంట్ ఎన్నికల్లో కాంగ్రెస్ ఊపిరి పోకుండా నిల్చిందన్న ప్రతిపక్షాల ప్రచారానికి ఈ ఉపఎన్నికల ద్వారానే సమాధాన మివ్వ వలసి వుంటుంది. అసమ్మతీయుల ఆగానికి ఇవి కేంద్ర బిందువులౌతాయి. అందువల్లే అభ్యర్థుల ఎంపిక నుంచి ఆయన ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తున్నారు.

## జనవాణి

3 పేజీ తరువాయి

రాష్ట్రపతు లౌతుంటారు కాబట్టి, ఈ పదవికి ఎన్నిక కావడానికి అన్ని విధాల ఆయన అర్హుడు.

– అవుల కొండయ్య
గూడూరు

### వీధి కొళాయిలకు రోజంతా నీళ్లివ్వండి!

మే నెల ఎండలు మాడ్చి పారేస్తున్నాయి. ఉదయం 9నుంచి సాయంత్రం 4 గంటల వరకు వళ్లు ఓపెన్‌లో బ్రెడ్ ఉడికినట్లు ఉడికి పోతున్నది; చెమటతో చొక్కాలు తడిసి పోతున్నాయి.

పల్లెటూళ్ల నుంచి పనులపై టౌన్‌లకు వచ్చే వారికి దప్పిక తీర్చుకోను కూల్‌డ్రింక్స్ మాత్రమే దొరుకుతున్నాయి. ఆ ఖర్చు అందరూ భరించలేరు; కూల్ డ్రింక్‌లతో దాహమూ తీరదు. ఈ పరిస్థితులలో మునిసిపాలిటీ వారు వేసవి కాలం పూర్తయ్యే వరకు వీధి కొళాయిలలో రోజంతా నీరు వదిలితే పౌరులు ఎంతో సంతోషిస్తారు. బాటసారులు, భిక్షగాళ్ల వంటి వారు, రిక్షా త్రొక్కి బ్రతికే వారు వడదెబ్బకు గురి కాకుండా రక్షింప బడుతారు.

– బి. పట్టాభిరామయ్య
నెల్లూరు.

## ఢిల్లీ దర్బారు

( మొదటి పేజీ తరువాయి )

జూన్ 8 తేది జరుగనున్న
ఎన్నికలు ముఖ్యమంత్రి జనార్ధన

## మునిసిపల్ ఎన్నికలు

( 2వ పేజీ తరువాయి )

లోకవర్గం క్రింద పరిగణించ వచ్చో లేదో తెలియదు. ఆయన సర్వేపల్లి ఎమ్మెల్యే అయినప్పటికీ, నెల్లూరు రాజకీయంతో ప్రత్యక్ష సంబంధాలే నెరపుతున్నారు. మునిసిపల్ కౌన్సిలర్లు కాదల్చిన ఛోటా నాయకులు పలువురు ఆయన ఇంటి దగ్గర గుమికూడుతున్నారు. దేవ కుమార రెడ్డి,వగైరా యువకిశోరాలను ఆయన వర్గం క్రిందే జమ కట్టవచ్చు. తెలుగుదేశానికి – రమేష్ రెడ్డి! అయిన అభ్యర్థి అయినా కాకపోయినా అభ్యర్థిత్వ నిర్ణయం దగ్గర నుంచి ఎన్నికల నిర్వహణ వరకు రమేష్ రెడ్డి చేతుల మీదుగా జరిగే అవకాశం వుంది.

ఎన్నికలకు సంబంధించి రంగంలోకి దిగుతాయనుకున్న వర్గాలు ఈ నాలుగే! మాగుంట సుబ్బరామ రెడ్డి గారి పేరు వినవస్తుంది కాని ఈ రొమ్ములో ఆయన కాలు పెడతారని ఎవరూ భావించడం లేదు.

జెక, ఆనం వర్గంలో అభ్యర్థి ఆనం వివేకానంద రెడ్డి అవుతాడు. రాజకీయాలలో తల మునకలుగా తిరగడం తప్ప పదవీకాంత పొందురుచి అనుభవించని యువకుడు వివేకానంద రెడ్డి కె.వి. సుబ్బారెడ్డి వర్గంలో అభ్యర్థి ఆయనే! గతంలో తాను ఎమ్మెల్యేగా వున్నాడు. కాబట్టి, అవకాశం అల్లుడు శ్రీ కలువకూరు చంద్రశేఖర రెడ్డికి ఇవ్వాడు. అప్పుడు తానే నిరుద్యోగి ; ఛాన్సెందుకు మిస్ చేసుకుంటాడు చెప్పండి! సిపి శేషారెడ్డి గ్రూప్‌కు స్థిరమైన అభ్యర్థి ఎవరూ లేరు. వారు స్వంతంగా ఛైర్మెన్ అభ్యర్థిని నిలబెడతారో లేక వార్డుల పెత్తనం కోరి మరొకరిని సమర్ధిస్తారో తెలియదు. మాగుంట సుబ్బరామ రెడ్డి మాట చెప్తే తనకు ఛైర్మెన్ గిరి ఖాయమని శ్రీ పత్తి రవీంద్ర బాబు ఆశ. సుబ్బరామ రెడ్డి కరుణా కటాక్ష వీక్షణాల కోసం చకోర పక్షులై ఎదురు చూస్తున్నవారు మరి కొందరూ వున్నారు. కాని సీలు ఫలాని వారు నా అభ్యర్థి అని నోరు విప్పి చెప్తాడా అన్నదే సందేహం. సర్వప్రియుడుగా వున్న నాయకుడెవరూ, శత్రువులను కొని తెచ్చే ప్రతిపాదనలు పరిశీలనకు తేరు. అది స్వంతానికి క్షేమమూ కాదు.

రమేష్ రెడ్డి "నేను పోటీ చేయనంటె చేయనని" బల్లగుద్ది చెప్తున్నారు కాని, టౌన్‌లో తిరిగి అనుచరులను కలియడం చూస్తే, నామినేషన్ రోజు "పురజనుల కోరిక పై" పోటీకి సై అంటాడనిపిస్తున్నది. ఆయన కది అలవాటు కూడా! ఎమ్మెల్యే ఎన్నికల్లో ఓటమి తర్వాత, ఛైర్మెన్ పదవికి రాజీనామా చేయబోయి పురజనుల భాధ పడతారేమోనని ఆగిపోయిన వాడే కదా?

రాజీవ్ విగ్రహం, నాచారం

కేసులతో సుప్రసిద్ధులైన ఎస్‌ఎస్‌యుబి యు వ వ్యాఘ్రం శ్రీకోటంరెడ్డి విజయకుమార రెడ్డి స్వతంత్రుడిగా రంగంలో నిల్వడానికి ఉర ఉరలాడుతున్న ట్లుంది. ఇది నిజమైన పోటీ ప్రయత్నమా లేక, విత్ డ్రామలోకు కొన్ని వార్డుల బేరమా తెలియదు.

ఎన్నిక సంగతి ఏమీ తేలకముందే భాషికాలు కట్టుకొని పీటలపై కూర్చుంటున్న పెండ్లి కుమారుల జాబితా ఇది. అనాటికిఅది కొండవీటి చాంతాడంత పెరిగినా ఆశ్చర్యం లేదు. పాపం సింహపురి నగర కాంతకు శిరోభారం కల్గించే స్వయంవరమే ఈ మునిసిపల్ ఎన్నికలు.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ తరువాయి

### మరణం

జగదేవిపేట స్వగ్రామమైనా నంద్యాల రైతుగా గత మూడు దశాబ్దాలుగా అక్కడ పలుకుబడి ప్రాపు సంపాదించి. ఒక సమయంలో ఆ మునిసిపల్ ఛైర్మెన్ పదవి కూడా అందినట్లుంది జారిపోయిన సహృదయుడు, అదృష్ట దీపుడు శ్రీ తిక్కవరపు బాబురెడ్డి (81), 3వ తేది హైదరాబాదులో గుండెపోటుతో కాల ధర్మం చెందారు.

బాబురెడ్డిగారి సంతానంలో ప్రతి ఒక్కరూ ఒక బంగారు కొండగా, ఒక పారిశ్రామిక మేటిగా, ఒక ప్రసిద్ధుడుగా, వెలుగొందు తున్నావారే పెద్ద కొడుకు చంద్రశేఖర్ రెడ్డి డక్కన్ క్రానికల్ – ఆంధ్రభూమి పత్రికా సముదాయా అధిపతిగా, పెద్ద పారిశ్రామికుడుగా, రాజ్యసభ సభ్యుడుగా ఉన్నవాడు. రెండవ కుమారుడు రాజగోపాల రెడ్డి అజ్ఞాత భాగ్యశాలి, యోగ్యతగల వ్యక్తి; మూడవ వాడు జగమెరిగిన భక్తశిఖామణి, టి.టి.డి. ఛైర్మెన్ సుబ్బరామిరెడ్డి. ఆయన ఏకైక కుమార్తె రాజకీయ వాసన, పదవీ దుగ్ధ లేకపోయినా పలుకుబడిలో తక్కువగాని ఒడిదుడుకులు లేని గుమపాటి శ్రీనివాసులు రెడ్డి ధర్మపత్ని. మన శ్రీ గుమపాటి రామచంద్రారెడ్డి సోదరి, బాబురెడ్డి ధర్మపతి.

ఈ విధంగా బాబురెడ్డి పరిపూర్ణ జీవి. ఆయన కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

### నీటిమట్టం

| | |
|---|---|
| కలిగిరి | 18.3 అ |
| సర్వేపల్లి | 6.1 అ |
| నెల్లూరు చెరువు | 13.4 అ |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | 9672 | 2800/- |
| | 9674 | 3000/- |
| | ఐ.ఆర్ 20 | 2300/- |
| | సున్నాలు | 2200/- |
| మొలగొలుకు బియ్యం 70 కి | | 520/- |
| బంగారు నవర 8 గ్రా | | 3300/- |
| వెండి 10 గ్రా | | 85/- |

## పంచాంగము

తేది 11 నుండి శుక్ర మౌఢ్యమి ప్రారంభం. కర్తరి ప్రారంభము

### మే నెల తిథులు

వైశాఖ శుద్ధ

| | | |
|---|---|---|
| తే 9 | శని సప్తమి | ప.గం11.40 వ |
| తే 10 | ఆది అష్టమి | ప.గం. 8.37వ |
| తే 11 | సోమ నవమి | ప.గం. 7.49వ |
| | దశమి | రా.గం.3.25వ |
| తే 12 | మంగళ ఏకాదశి | రా.గ. 1.52వ |
| తే 13 | బుధ ద్వాదశి | రా.గ. 12.04వ |
| తే 14 | గురు త్రయోదశి | రా.గ. 10.35వ |
| తే 15 | శుక్ర చతుర్దశి | రా.గ. 9.33వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

# అసత్య ప్రకటనలతో మిగిలేది అపహాస్యమే !

నేడు దాదాపు ఇంటింటా టి.వి.లు వెలిశాయి. దూరదర్శన్ ధర్మమా అని వారానికి కనీసం మూడు సినిమాలయినా చూడదానికి వీలవు తోంది. వి.సి.పి.కొనలేని వారికి అవి అద్దెకు దొరుకుతున్నాయి. సందు సందునా వీడియో లైబ్రరీలు దాపురిం చాయి. మరో ప్రక్క స్టార్ టి.వి.తో గంటల తరబడి ఇంటి పట్టునే కాలక్షేపం శుద్ధ అమాయకత్వమే. ఏ చిత్రాన్ని ఆదరించాలో, ఏ సినిమాను తిరస్క రించాలో.అగ ప్రజలకు బాగా తెలుసు. తాము ఏది చెబితే ప్రేక్షకులు అది ఇంకా నమ్మే స్థితిలో ఉన్నారన్న అజ్ఞానంలో ఉన్నారు దర్శక నిర్మాతలు. ఫలానా చిత్రం వెరైటీ ఇతివృత్తమని. కథ మీద అన్నేల్లు కూర్చున్నామని. హీరో ఇమేజ్ పెంచే టిపికల్ పాత్ర అని.



జంబలకడిపంబలో ఆమని

జరుగుతోంది. ఇల్లు వదలి సినిమా థియేటర్‌కు వెళ్ళాలనే ఓపిక సగటు మానవుడిలో క్రమ క్రమంగా సన్నగిల్లుతోంది. కేవలం పబ్లిసిటీ స్టంట్ లాంటి స్టేట్‌మెంట్లు జనాన్ని ఆకర్షిస్తాయని దర్శకనిర్మాతలు ఇంకా దురభి ప్రాయంలోనే ఉన్నారు. జనాన్నిమోసం చెయ్యగలం అనుకుంటే మరికొందరు ఫలానా చిత్రం వందరోజులు ఆడి తీరుతుందనీ స్టేట్‌మెంట్లు విపరీతంగా ఇస్తున్నారు. అలాంటి చిత్రాలే ఎక్కువ శాతం ఫ్లాప్‌లు అవుతున్నాయి. తమ స్టేట్‌మెంట్లు ఎందుకూ పనికి రావడం లేదని ఎవ్వరూ అతర్వాత ఆలోచించరు. మళ్ళీ కొత్త చిత్రం ప్రారంభించినప్పుడు ఇలాంటి స్టేట్‌మెంట్లే ఇస్తారు. ఇది ఆత్మవంచన కాదా? మొత్తం మీద ప్రేక్షకులను మభ్యపెట్టి కాలం గడచిపోయింది. స్టేట్‌మెంట్లకు తగ్గ స్థాయిలో చిత్రాలు లేకపోతే నిస్సందేహంగా ఇట్టే తిప్పికొట్టేస్తారు. దర్శక నిర్మాతలు. తదితరులు ఆత్మవిమర్శ చేసుకోవలసిన సమయం ఆసన్నమైంది.

## ఒకే పాయింట్ మీద అయిదారు చిత్రాలు

కని పెంచి పెద్ద చేసిన వృద్ధ జననీ జనకులను వారి సంతానం నిర్లక్ష్యం చేసే పాయింట్‌పై "సూరిగాడు" లాంటి చిత్రాలు వచ్చాయి. అదే పాయింట్‌పై మరికొన్ని చిత్రాలు తయారవుతున్నాయి. కాని, అలాంటి చిత్రాలు నిర్మిస్తున్న ప్రతి నిర్మాతా తనది వెరైటీ కథ. ఆకథా చర్చలపై ఆరు నెలలు కృషి చేసినట్లుప్రెస్ మీట్‌లలో చెప్తున్నారు. ఇక కొత్తదనానికి అర్థమేముంది ?

## కొలిక్కి వచ్చిన గొడవలు

గోరంతలు కొండంతలు చేసి. గోటితో పొయ్యే విషయాన్ని గొడ్డలి వరకు తీసుకెళ్ళడం ఈ సినిమా రంగంలోనే పరిపాటి. తమకు నిర్మాతలు సరైన అవకాశాలు ఇవ్వకుండా మద్రాసు నుంచి స్టంట్ మాస్టర్‌లను రావిం చడ మేమిటని హైదరాబాదు లోని సినిమా కార్మికుల ఆవేదన. నిర్మాతల ఆహ్వానంపై వచ్చిన తమపై హైదరాబాద్ లోని కార్మికులు రెండు

తరువ 11 పేజిలో

మంచి కుటుంబ చిత్రం చూడాలంటే

# అల్లరిపిల్ల

## వెళ్ళండి – ఎంతో బాగుంది !

ఏమిటబ్బా ఇది! మన తెలుగు రచయితలు ఇంత మంచి కథను, సున్నితమైన సెంటిమెంటుతో కూడుకున్న కథను, సరళంగా, సాఫీగా, ఆద్యంతం హాస్యరస భరితంగా వున్న కథను, సకుటుంబ సమేతంగా చూచి ఆనందించ తగ్గ కథను వ్రాయటమే మిటబ్బా! అని ఆశ్చర్య పడవలసి వస్తుంది భార్గవ్ ఆర్టు ప్రొడక్షన్సు వారి "అల్లరి పిల్ల" చిత్రం చూచిన తర్వాత. ఇంతటి సలక్షణమైన, ప్రయోజనకరమైన కథను వ్రాయిం చేందుకు మన తెలుగు సినిమా నిర్మాతలకు అంత పట్టుదల, ఓపిక, ఒరిజినాలిటీ ఎక్కడివబ్బా! అని కూడా ఆశ్చర్యపడ వలసి వస్తుంది. ఈ ఆశ్చర్యాన్నుంచి కాస్త తేరుకొని చూస్తే అసలు ఈ చిత్రం తాలూకు కథ తెలుగు వారి సృష్టికాదని తెలుతుంది. ఇది ఇటీవల దక్షిణాదిన దిగ్విజయంగా ఆడిన మలయాళ చిత్రం "కిలుక్కం" మాతృక అని తెలుస్తుంది.

మాతృకను కాపీ కొట్టడంలోను, అనుకరించడంలోను తప్పటడుగులు వేసే దర్శకులూ వున్నారు. అలా కాకుండా దర్శకుడు కోడి రామకృష్ణ ఇది ఒరిజినల్ తెలుగు చిత్రమా అన్నంత సహజంగా రూపురేఖలు దిద్దాడు. సెంటిమెంటుకు హాస్యరసం మిళితం చేసి అన్ని రకాల ప్రేక్షకులను ఆకట్టుకున్నాడు. మంచి కుటుంబ చిత్రాలు కావాలి అని కోరుకునే ప్రేక్షకులకు కోడి రామకృష్ణ అందించిన బహుమానం ఈ చిత్రం.

ఇక, భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్సు అధినేత ఎస్. గోపాలరెడ్డి స్వయం పర్యవేక్షణ లేకుండా ఇంత మంచి చిత్రం తయారైందీ అంటే ఎవ్వరూ నమ్మరు. అసలు సిసలైన "నిర్మాత" అనే పదానికి నిజరూపం ఎస్. గోపాల రెడ్డి అని చెప్పక తప్పదు. ఆయన కార్యదక్షుడు,లక్ష్య సిద్ధికి "అల్లరి పిల్ల" మరో విజయపతాకం.

ఎస్. గోపాలరెడ్డి, కోడి రామకృష్ణలు కృష్ణార్జునుల్లాగా, కురు క్షేత్రం వంటి తెలుగు సినిమా రంగంలో

చిత్రసమీక్ష
గ్రిద్దలూరు గోపాలరావు

ఓటమి ఎరుగకుండా విలక్షణమైన చిత్రాలు నిర్మిస్తూ, దిగ్విజయ యాత్ర సాగిస్తున్నారు.

నందిని (మీనా) అనే అమ్మాయి ఈశ్వర రావు అనే యువకునికి అక్రమ సంబంధం గా పుట్టింది. ఈశ్వర రావు రిటైర్డు న్యాయాధిపతి పుండరీకం (సత్యనా రాయణ) కుమారుడు. కుటుంబం పరువు పోతుందని పుండరీ కాక్షయ్య, నందినిని చిన్నతనం నుంచి ఒక ఆర్ఫనేజ్‌లో వుంచి పెంచుతాడు. ఈ విషయం నందినికి తెలియదు. బాగా ఎదిగిన తర్వాత తనను ఆప్యాయంగా చూచుకునే పుండరీకాక్షయ్యను కలుసుకు నేందుకు తిరుపతికి బయలు దేరుతుంది. తిరుపతి రైల్వేస్టేషనులో అత్యాధునిక వేషంలో దిగిన నందినిని చూచి రాజా (సురేష్) అనే గైడ్

తరువ 11 పేజిలో

## సణుగుడు

4 పేజీ తరువాయి

న్నాయి. ఈ కంపెనీలకు వట్టపరంగా అనుమతి వుందో లేదో ఎవరికీ తెలియదు. వాటిని నడిపే వారి ఆర్థిక పరిస్థితి నిజాయితీ అసలే తెలియదు. పంచరంగుల్లో, కళ్ళు మిరిమిట్లు గొల్పే రీతిలో కరపత్రాలు, బ్రోచర్లు ప్రచురించి కోట్లాది రూపాయల ప్రజా ధనాన్ని సేకరిస్తున్నారు. ప్రజలను వెర్రి వ్యామోహంలో పడవేయడానికి మారుతి కార్లు, కలర్ టెలివిజన్ల వంటి బహుమతులను ఎర చూపుతున్నారు. గాలానికి ఎర కుట్టి చేప పట్టడం వంటిదే ఈ వ్యాపారం. వడ్డీ లెక్కలు తెలిస్తే, వాటిలో పెట్టుబడి పెట్టే వారెవరికైనా, తామెంత నష్టపోతున్నదీ, మోస పోతున్నదీ అర్థమౌతుంది.

సంవత్సరానికి కొక సారి అసలుకు వడ్డీ కలిపే పద్ధతిలో లక్షరూపాయల పెట్టుబడితో నెలకు రెండు రూపాయల వడ్డీ లెక్కన వ్యాపారం చేస్తే ఇరవైఐదేళ్ళకు ఆ లక్ష ఎంతకు పెరుగుతుందో తెలుసా? 2కోట్ల 64లక్షల 64వేల రూపాయలు! అంటే 265రెట్ల పెరుగుదల అన్నమాట. ఆలెక్క చూడండి-(లక్షపెట్టుబడికి)

| సం. | 13శాతం రూపాయి వడ్డీ | 25శాతం రెండు రూపాయల వడ్డీ |
|---|---|---|
| 1 | 1,13,00 | 1,25,000 |
| 2 | 1,27,000 | 1,56,000 |
| 3 | 1,44,000, | 1,95,000 |
| 4 | 1,63,000 | 2,44,000 |
| 5 | 1,84,000 | 3,05,000 |
| 6 | 2,08,000 | 3,81,000 |
| 7 | 2,35,000 | 4,76,000 |
| 8 | 2,65,000 | 5,96,000 |
| 9 | 3,00,000 | 7,45,000 |
| 10 | 3,39,000 | 9,31,000 |
| 11 | 3,83,000 | 11,64,000 |
| 12 | 4,33,000 | 14,55,000 |
| 13 | 4,89,000 | 18,19,000 |
| 14 | 5,53,000 | 22,73,000 |
| 15 | 6,25,000 | 28,42,000 |
| 16 | 7,06,000 | 35,52,000 |
| 17 | *7,98,000 | 44,40,000 |
| 18 | 9,02,000 | 55,51,000 |
| 19 | 10,19,000 | 69,38,000 |
| 20 | 11,52,000 | 86,73,000 |
| 21 | 13,02,000 | 1,08,42,000 |
| 22 | 14,71,000 | 1,35,52,000 |
| 23 | 16,62,000 | 1,69,40,000. |
| 24 | 18,78,000 | 2,11,75,000 |
| 25 | 21,23,000 | 2,64,69,000. |

ఇది , సంవత్సరానికి ఒకసారి అసలుకు వడ్డీ కలిపితే వచ్చే మొత్తం. సాధారణంగా ఫైనాన్స్ కంపెనీలు ప్రతి మూడు నెలలకు అసలు, వడ్డీ, కలుపు తుంటాయి. రోజువారీ వాయిదాలలో కట్టించుకొనే కంపెనీలు, ప్రతిరోజూ అసలు వడ్డీ కలిపినట్లే లెక్క. రెండు రూపాయల వడ్డీకి అప్పులిచ్చే ఫైనాన్స్ కంపెనీలు చాలా అరుదు. సాధారణంగా వారు 36 శాతం వడ్డీ వసూలు చేస్తుంటారు. బ్యాంకు రేట్లు పెరిగిన తర్వాత నెల్లూరులో కొన్ని కంపెనీలు 40శాతం కూడా వసూలు చేస్తున్నాయి. 36శాతం (3రూపాయల వడ్డీ) దండితే లక్షరూపాయల మొత్తం 25ఏళ్ళలో 26కోట్లపైనే అవుతుంది. ఈ లెక్కన నెల్లూరులో పాతికేళ్ళ నుంచి వడ్డీ వ్యాపారం చేస్తున్న సంస్థలు, వ్యక్తుల దగ్గర ఎంత సొమ్ము వుండాలో వూహించుకోవాల్సిందే!

అప్పటి విషయానికొస్తే 20 వాయిదాలలో కట్టే సొమ్ముకు, ఆ తర్వాత 60నెలలలో రెట్టింపు ఇస్తామని చెప్తున్న కంపెనీలు ప్రజల ధనంతో ఎంత ఘరానా వ్యాపారం చేస్తున్నదీ వూహించలేము. మొత్తం 80 నెలలలో 2రూపాయల వడ్డీ లెక్కన ఏటా అంతకంత వేస్తే -వంద రూపాయలు 475 రూపాయ లౌతుంది. వారు మామూలుగా జరిపే 3రూపాయల వడ్డీ వ్యాపారంలో అదే -వంద -6 సంవత్స రాలా ఆరు నెలలకు 860 రూపాయ లౌతుంది. అంటే ఎనిమిదిన్నర రెట్లు పెరుగుతుందన్న మాట. నెల్లూరులో కొత్తగా భారీ ప్రచారంతో, పెద్ద పెద్ద పేర్లతో ప్రారంభింప బడిన ఒక కంపెని కోటి రూపాయల వరకు డిపాజిట్లు సేకరించినట్లు వినికిడి. వారి పెట్టుబడి - తలకు 25వేల లెక్కన - రెండున్నర లక్షలు; ఆదాయం- 8కోట్ల 60లక్షలు. నిజాయితీగా ప్రజలకు డిపాజిట్లు వాపసు చేసినా ఆరున్నర కోటి నికరలాభం. అంతంత లాభాలుండే టప్పుడు, ఎన్ని మారుతి కార్లు, ఎన్ని వాషింగ్ మెషిన్లు ఇచ్చినా వచ్చే నష్టం ఏముంది ? కంపెనీలో పెట్టుబడి పెట్టేవారు ఒక్కసారి తామెంత నష్ట పోతున్నదీ లెక్క వేసుకోగల్గితే, ఫైనాన్స్ కంపెనీలు చేసే మోసం అర్థమౌతుంది.

ఇది ప్రక్కన పెట్టండి . అసలు ఆరున్నర సంవత్సరాల తర్వాత ఈ కంపెనీలు ప్రజలకు తాము సేకరించిన డిపాజిట్లు సక్రమంగా వాపసు చేస్తాయన్న నమ్మకం ఎక్కడుంది?ఏ చట్టం వారిని నియంత్రిస్తుంది ? ఏ సంస్థ డిపాజిట్లకు భద్రత కల్పి స్తుంది?అసలు ఎంత కాలం ఈ కంపెనీలు వుంటాయి? భాగస్తుల పేచీతోనో, నిర్వాహకుల అసమర్థతతోనో, కంపెనీలు మూతపడితే ప్రజల డిపాజిట్ల గతి ఏమిటి? ఆరోజు ఎవరికి పోయి మొర పెట్టుకోవాలి?పెద్ద పెద్ద పారిశ్రామిక వేత్తలు నడిపిన లిమిటెడ్ ఫైనాన్స్ కంపెనీలు , చిట్‌ఫండ్ కంపెనీలు దివాలా తీసిన సందర్భాలున్నాయి. లక్షలాది ప్రజల కొంపలు ఆరిపోయాయి. అటువంటప్పుడు తాడు బొంగరం లేని వ్యక్తులు ప్రారంభించే ఈ కంపెనీలలో ప్రజల ధనానికి ఏమి రక్షణ వుంటుంది?

ఎవరంటే వారు, ఎవరిష్టం వచ్చిన రీతులలో వారు ప్రజల డబ్బుతో వ్యాపారం చేసే దుర్మార్గాన్ని నిరోధించ డానికి ప్రభుత్వం తక్షణం ఒక చట్టం తేవాలి!ప్రజలు మారుతి కార్లకో, మోటార్ సైకిళ్ళకో భ్రమసి కష్టపడి దాచుకున్న డబ్బును పెట్టుబడి పెట్టబోయే ముందు ఆయా కంపెనీల స్థితిగతుల గురించి ఆలోచించాలి!లేకుంటే చేతులు కాలిన తర్వాత పట్టు కోవడానికి ఆకులు కూడా దొరకవు.

## పినాకినీ తీరం

2 పేజీ తరువాయి

ప్రజాపరిషత్తులు, సహకార ఎన్నికలలో తెలుగు దేశంతో ధీటుగా పోటీ చేయడం అధికారంలో లేని టైంలో జరిగింది. ఆ రోజుల్లో ఆయనకు ఆసం వాళ్ళ వ్యతిరేకులు, నెల్లూరు కాంగ్రెస్ శాసన సభ్యుని వర్గం వ్యతిరేకం; ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన నుండి అధికార ఫలితాలు ఎవరైతే ఎక్కువగా పొందారో వారంతా వ్యతిరేకం. అనాడు జనార్ధనరెడ్డి మనిషిగా, ఆయన ప్రతినిధిగా నెల్లూరులో పేరు గడించింది జె.కె. రెడ్డి. అది నుండి ఆయన్ను విడకుండా వుండిన వారు అట్లనే వుండిపోవాలనుకొంది. ఇది1988 నాటి పరిస్థితి. నా అభిప్రాయం ప్రజా మన్ననలను, సానుభూతిని చూరగొన్న ఆ సమయం జనార్దన రెడ్డి రాజకీయ జీవితంలో సువర్ణాధ్యాయం ముఖ్య మంత్రిత్వానికి చేరు కోవడమనేది అధి కారాధ్యాయంలో బంగారు దశ అనుకోండి!

1989 లో ఎన్నికలొచ్చే సరికి మళ్లీ మనస్పర్థలు, ఒలుకులు ప్రారంభమైనాయి. పాత అభ్యర్థుల సూత్రం క్రింద జనార్ధన రెడ్డికి విశ్వాస పాత్రులు కాని వారు కూడా ఒకరిద్ద రొచ్చారు; వెంకటగిరిలో తాను మెజారిటీలో జిల్లాలో మొదటి వారుగా గెల్చారు. కాని ఒక్క అపశృతి – ఏడేళ్ల అంటి పెట్టుకొని వుండి, జిల్లా ప్రజాపరిషత్తు ఎన్నికలు అతని బంధు వర్గం వద్దన్నా వ్యయప్రయాసలు కోర్చి పోటీ చేసి పరాజయాన్ని పొందిన జె.కె. రెడ్డికి సీటు లభించక పోవడం ఆయనకు అసంతృప్తే కాదు, కాంగ్రెస్ వాదులందరికీ కొరత గానే వుండినది. ఇటు బలమైన తెలుగుదేశం అభ్యర్థిని, అటు అధికార కాంగ్రెస్ అభ్యర్థిని ఎదుర్కొని అంత గ్లామర్‌తో నెల్లూరు టవున్ సీటులో గెల్వ గలగడానికి, అతని పట్ల సామాన్య ప్రజల్లో కూడా, ఏర్పడిన సానుభూతి సదభిప్రాయాలే కారణం. తనకు టిక్కెట్ రాకపోవడానికి ఆయనకు జనార్ధన రెడ్డి మీద కంటే, సి.వి. శేషారెడ్డి మీద అసంతృప్తి ఎక్కువ. తనకు అంతో అప్తుడుగా వుండిన వ్యక్తి తన అవకాశాన్ని వదలుకోక పోయినా, కనీసం మాట సామెత్తైనా సీటు తన కిస్తానన లేదే ననేది జె.కె. రెడ్డి కొరతేమో ననిపిస్తుంది. జనార్ధన రెడ్డి మీద కష్టమంతా – ఆయన పట్టుదల వుంటే నెల్లూరు, సర్వే పల్లి కాకున్నా మరేదైనా ఇప్పించ లేక 'పోయాడా అనేది ఒకటి. స్వతంత్రుడుగా ఎన్నికైనా అసలు సిసలు కాంగ్రెస్ వాడిని కాబట్టి, శాసన సభా కాంగ్రెస్ పార్టీతో కలసి వుంటున్న వాణ్ణి కాబట్టి తన పార్టీ బహిష్కరణను రద్దు చేయించ కూడదా అనేది రెండవది.

జె.కె. రెడ్డి ఈ విషయంలో ముఖ్యంగా నా వద్ద బయట పడరు. ఇది కేవలం నా మాట మాత్రమే! ఏమైతే నేమి టవున్‌లో తాను అధికారంలో లేని సమయంలో తన మనిషిగా గట్టిగా నిలబడిన జె.కె. రెడ్డిలో అనుమేకత ఆప్యాయత విశ్వాస పాత్రత కాస్త సడలాయా అనిపిస్తుంది. క్రమంగా అవి ఇరువురి మధ్య అపోహలకు దారి తీశాయి; అంతరంగికంగా దూరం చేశాయి.

ఈ నేపథ్యంలో అక్టోబరులో జరుగుతాయను కుంటున్న మునిసిపల్ ఎన్నికలలో నెల్లూరులో జనార్దన రెడ్డి సొంత మనిషి ఎవరు? ఆయన తన వద్ద బాధ్యతను ఎవరి కప్పగిస్తారు? అప్పగించడానికి ఎవరున్నారు? విద్రోహంగా ప్రవర్తించిన వారు ముఖ్యమంత్రిత్వ ఆకర్షణ వుంది కాబట్టి, మేమున్నాం, మేమున్నాం అంటూ ముందుకు త్రోసుకొని వస్తారు. అటువంటి వారి కప్పగించి మళ్లీ పొరపాటుచేస్తారా? నెల్లూరులో తన మనిషంటూ లేకుండా చేసుకుంటారా?

జనార్ధనరెడ్డి గారు లోతుగా ఆలోచించి స్వతంత్రంగా నిర్ణయం తీసుకోవలసిన ముఖ్య విషయం ఇది. చేసిన పొరపాటే మరలా చేయకూడని విషయమిది. పరుల మాటలకు చెవి ఇవ్వకూడని విషయం ఇది. అవాంఛితులు, అనర్హులను రంగంలోకి దించ కూడని విషయమిది. ప్రశాంతంగా సావధాన చిత్తంతో తాత్కాలిక అపోహలు అభిప్రాయ భేదాలకు తావివ్వకుండా, విశాల దృష్టితో వీక్షించ వలసిన విషయం ఇది. నెల్లూరులో రాజకీయంగా తాను బలోపేతుడు కావడానికి దోహదమిచ్చే కీలకమైన విషయమిది! పొరపాటు లేకుండా నిర్ణయం తీసుకోవలసిన సమయం ఇది.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

ఆమెను చాలా ధనవంతురాలుగా భావించి ఆమెను ఒక పెద్ద హోటల్ గదిలో వుంచుతారు. నందిని అల్లరి చేష్టలు చూచి ఆమె పిచ్చిపిల్ల అనుకుంటారు. రాజా అతని మిత్రుడు చిన్నా! నందిని తప్పి పోయిందని ఆమెను పట్టించిన వారికి బహుమతి యిస్తామని ఒక రోజు దినపత్రికలో ప్రకటన చూచి, ఆమెను ఆ ప్రకటన దార్లకు అప్పగించేందుకు చిన్నా పూనుకుంటారు. ఇది తెలిసిన నందిని, తాను పిచ్చిదాన్ని కాదని, కొన్ని కారణాల వల్ల అలా నటించానని, తన విషయం చెప్పుకుంటుంది. రాజా నందినిని పుండరీకం ఇంట్లో పని మనిషిగా చేరుస్తారు. పుండరీకం నందినిని చాలా ఆప్యాయంగా చూచు కోవటం కుటుంబ సభ్యులకు ఈర్ష్య కలిగిస్తుంది. ఈశ్వరరావు నందినిని చంపించేందుకు ప్రయత్నిస్తారు. ఈ విషయం తెలిసిన రాజా నందినిని రక్షిస్తారు. చివరకు నందిని తన కూతురని తెలుసుకున్న ఈశ్వరరావు ఆమెను దగ్గరకు తీస్తారు. పుండరీకం నందినిని రాజాను కలుపుతారు.

ఎక్కడా అశ్లీలం లేకుండా హాస్యభరితంగా కథను నడిపారు దర్శకుడు. హీరోయిన్‌కు విలువైన ప్రాధాన్యత నిచ్చారు. నందిని పాత్రకు నవ యవ్వనంలో వున్న మీనా నూతన కళలతో ప్రాణం పోసింది. అల్లరిపిల్లగా తన చిలిపి తనంతో గిలిగింతలు పెట్టింది. రాజాగా సురేష్ సునాయాసంగా పాత్రను నడిపించారు. ఈ చిత్రం మీనాకు, సురేష్‌కు మంచి పేరు తెచ్చింది. సత్యనారాయణ హుందాగా నటించారు. చిన్నా మంచి హాస్య నటుడుగా నిలబడగలరు. ఈశ్వర రావు, అప్పారావు బాగా నటించారు. వెన్నెలకంటి పాటలు విద్యాసాగర్ సంగీతంలో కమ్మగా వినిపించాయి.

## ఊరు పేరు

(9 పేజీ కొరవ)

మానవాకృతిగా, రూపములో, వృషభ రూపముగా సహజ తోరణములుగా శివలింగ రూపముగా, (హిమాలయలలోని కైలాస పర్వత మట్టిదే) కనుపించుతాయి. విశాఖ పట్నంలోని 'డాల్ఫిన్ నోస్' పర్వతము డాల్ఫిన్ ఆ చేప వంటి ముక్కు నోరుగలది.

గుడి నరవ అనే గ్రామం ఉదయగిరి సమీపంలో ఉదయగిరి – గండి పాళెం రహదారిలో వుంది. ఊరిసమీపము నున్న కొండ, పడుకొని, తల ఎత్తు కొని వున్న తాబేలు మాదిరి వుంటుంది. దేహభాగము మెడ భాగము మధ్య దారి వుంది. అదే నరువ. నరువ అంటే కొండ దారి. కొండ క్రింది అంకమ్మ పేరుతో గ్రామ దేవత గుడి వుంది. కనుక ఆ వూరికి గుడి నరువ అని పేరు వచ్చింది.

సింహళ ద్వీపములో (నేటి శ్రీలంక) పోలన్నరువ అనే వూరుంది. రాజరాజ చోళుడు (985–1016 ఎ.డి.) సింహళాన్ని జయించి పోలన్నరువను రాజధానిగా చేసుకొని కొంత కాలము పరిపాలించాడు. చరిత్రకారులు యితనిని రాజ రాజా ది గ్రేటు (Raja Raja the great) అన్నారు. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన తంజావూరు బృహదీశ్వరాలయమును యీయన నిర్మించారు. సింహళాన్ని జయించాడు కనుక 'సింగలాంతక' అని బిరుదు యీయనకున్నది. నూళ్ళూరు పేటకు మరి యొక పేరు సింగలాంత పురం. ఈయన బిరుదనామంతోనే ఆ గ్రామానికి ఆ పేరు పెట్టారు.

పోలన్నరువను, రాజరాజచోళుని మరి యొక బిరుద నామంతో 'జననాథ' మంగళం అని కూడా పిలిచేవారు.

## కదరి సబ్ కోర్టులో

EP 8/87 OS 54/83

Between:

కె. బాదుషాబు — డిక్రీహోల్డరు

ఎదిరి

1. జి. కాంతమ్మ (died) by LRs, 2. జి. మలి రెడ్డి, 3. జి. రఘునాథ రెడ్డి
4. జి. సరోజమ్మ, 5. యమ్. సరస్వతమ్మ — జడ్జిమెంటు డెట్టార్లు

పై నెంబరు EP లో ప్రతి వాదులు స్వాధీనాను భవములో యుండు షెడ్యూలు దాఖలా ఆస్తిని పై కోర్టు వారి ఎదుట 22.6.92 వ తేదిన ఉదయం 10.30 నిమిషములకు బహిరంగముగా వేలము వేయబడును. కావలసిన వారు కోర్టుకు హాజరై వేలములో పాల్గొన వచ్చును.

### షెడ్యూలు

అనంతపురం. ఆర్.డి. కదిరి యస్.ఆర్.డికి చేరిన పూలకుంటపల్లి గ్రామములోని జమీను వివరములు

| SL.No. | బాబు | సర్వే నెం. | ఎ.సెం. | హెక్టార్లు | అమీనా మదింపు | రిమార్కు |
|---|---|---|---|---|---|---|
| 1. | Govt Dry | 158-1 | 0.04 | 0.0016 | 8000.00 | బావి |
| 2. | "" | 158-2 | 2.11 | 0.855 | 6200.00 | 1/2 భాగం |
| 3. | "" | 73 | 0.75 | 0.304 | 2500.00 | 1/2 భాగం |
| 4. | "" | 74-2 | 0.66 | 0.267 | 2200.00 | 1/2 భాగం |
| 5. | "" | 74-3 | 0.16 | 0.065 | 1200.00 | 1/2 భాగం |
| 6. | "" | 74-4 | 0.44 | 0.178 | 1000.00 | 1/2 భాగం |
| 7. | "" | 222 | 11-42 | 4.265 | 15200.00 | 1/2 భాగం |

8 డోర్ నెంబరు 1/65 పూలకుంటపల్లి పంచాయితీ లోని ఇంటికి చెక్కుబంది.

ఎనిమిది అంకణముల మిద్దె మరియు ఖాళీ స్థలమునకు చెక్కుబంది.

తూర్పు: బజారు; దక్షిణం: గోవిందు మాకిరెడ్డి మరియు కొండారెడ్డి ఇల్లు; పడమర: గొల్లపల్లి ఆదినారాయణ రెడ్డి ఇల్లు; ఉత్తరం: బజారు అమీనా మదింపు: 6000.00

9. పూలకుంటపల్లి గ్రామము లోని డోర్ నెంబరు 1/100 గల ఆరు అంకణముల మిద్దెకు చెక్కుబంది.

తూర్పు: బజారు, దక్షిణం: వారి యొక్క ఇల్లు; పడమర: బజారు; ఉత్తరం: గొల్లపల్లి వెంకట స్వామి రెడ్డి ఇల్లు.

అమీనా మదింపు 8000.00

వాయిదా తేది 22.6.92

A వేణుగోపాల శర్మ

డిక్రీహోల్డరు పరం న్యాయవాది

## అపహాస్యమే

(9 పేజీ కొరవ)

మూడు నెలల నుంచి హత్యా ప్రయత్నాలు జరుపుతూ ఏప్రిల్ 15న "అలెగ్జాండర్" షూటింగ్ సమయంలో స్టంట్ మాస్టర్ పాహుల్ పై హైదరాబాద్‌లో దౌర్జన్యం జరిపి నందుకు నిరసనగా ఆంధ్ర ప్రదేశ్‌లో షూటింగ్‌ల సినీ కార్మికుల సంఘం సమ్మెకు పిలుపు ఇచ్చింది. దాంతో పదిరోజులుగా మన రాష్ట్రంలో సినిమా నిర్మాణ కార్య క్రమాలు స్తంభించి పోయాయి. మేం తీసుకున్న కాల్‌షీట్లు వృధా అయి పోతున్నాయి. ఈ సమ్మెవల్లె మాకు కొన్ని లక్షలు నష్టం అంటూ కొందరు నిర్మాతలు గగ్గోలు పెట్టారు. చివరికి ఏమైతేనేం – చలన చిత్ర నిర్మాతలల మండలి జోక్యంతో ఈ గొడవలు ఒక కొలిక్కి వచ్చాయి. ఇకపై మన రాష్ట్రంలో జరిగే షూటింగ్‌లలో ఎలాంటి అవాంఛనీయమైన సంఘటనలు జరగకుండా చూడాలని, స్థానికంగా ఉన్నవారికి గాని, ఫిలిం కార్మికుల సమాఖ్య వారికి గాని ఏ సమస్య ఎదురైనా సమ్మెచేయకుండా నిర్మాతల మండలి ఉపసంఘానికి నివేదించాలని అంగీకారానికి ఉభయవర్గాలూ రాక తప్పలేదు.

## రోడ్ల నాశనం

(4 పేజీ కొరవ)

నెల్లూరులో, పౌరహక్కుల కోసం పోరాడు తున్నామనో, చెమటోడ్చి శ్రమిస్తున్నామనో చెప్పుకునే సంఘాలు, వ్యక్తులు ఎందరో వున్నారు కదా? చట్టాలు తెలిసిన వకీళ్ళు వున్నారు కదా? అటువంటి వారెవరైనా ఈ రోడ్ల దుర్వినియోగం పై పోరాటం జరపకూడదా ? స్వాగత ద్వారాల నిర్మాణం నివారించ కూడదా?

## చేపలు

(9 పేజీ కొరవ)

### మంచి నీటి రొయ్య పెంపకం

జెయింట్ ఫ్రెష్ వాటర్ రొయ్య (మ్యాక్రో బ్రెకియం రోసెన్ బెర్గి) పెంపకం రైతులకు లాభాలు పండించే రొయ్య జాతి. దీనికి వుండే రుచి, సువాసన, పెద్ద సైజు, మంచి రూపం వల్ల ఈ రకం రొయ్యలకు చెప్పలేని గిరాకీ వుంది.

ఆరు నుంచి 8 నెలల లోపు 125 గ్రాముల వరకు ఈ రొయ్యను పెంచవచ్చు. హెక్టారుకు 100 నుంచి 250 కిలోల వరకు ఉత్పత్తి సాధించ వచ్చు. హేచరీలలో పిల్లలు ఉత్పత్తి చేసే సాంకేతిక పరిజ్ఞానం ఇప్పుడు అందుబాటులో వుంది.

(సమాప్తం)

# నెల్లూరు సంగతులు

### రక్త, నేత్ర దాతల సంస్థల అడ్రసు మార్పు

సింహపురి స్వచ్ఛంద రక్త దాతల బృందం. నెల్లూరు నేత్రదాతల సంస్థలు ఇది వరకు లక్ష్మీపురం ఎక్స్‌టెన్షన్‌లో పని చేస్తుండేవి. వాటిని ఇప్పుడు 3-511 ఎ. మొదటి అంతస్తు, పూర్ణావారి వీధి, లక్ష్మీపురం, నెల్లూరు – 524 002. అన్న చిరునామాకు మార్చినట్లు శ్రీ తిక్కవరపు సుకుమార రెడ్డి తెలియజేస్తున్నారు. టెలిఫోన్ నంబరు - 25125.

### కళాంజలి పోటీలు

నెల్లూరులోని 'కళాంజలి' సాంస్కృతిక సంస్థ తృతీయ వార్షికోత్సవం సందర్భంగా రాష్ట్రస్థాయిలో కూచిపూడి, భరత నాట్యం, సినిమా పాటలు, ఏకపాత్రాభినయ పోటీలు జరుగుతాయి. మే 30 తేది జరిగే ఈ పోటీలకు మే 15 తేది లోపల దరఖాస్తులు పంపాలి. అడ్రసు శ్రీ పి. అనంత రావు, కళాంజలి, 14-191, కాపువీధి, నెల్లూరు.

### వివాహ సంబంధాలకు ప్రత్యేక వేదిక

నెల్లూరులో సేవా భావంతో విద్యా సంస్థలు నిర్వహిస్తున్న శ్రీ హరిహర ఎడ్యుకేషన్ సొసైటీ, వివాహ సంబంధాల విషయంలో ప్రత్యేక వేదిక ఏర్పాటు చేసింది. పెళ్ళి కావలసిన వారు సంస్థను సంప్రదిస్తే పరస్పర పరిచయ మహోత్సవం నిర్వహించి, నచ్చిన సంబంధాలకు ఉచిత సామూహిక వివాహాలు జరుపుతారు. ఆసక్తి గలవారు శ్రీ వి. రామదండు, 16/1106, మిద్దెపైన, కె.వి. అగ్రహారం, పొగతోట, నెల్లూరు అన్న చిరునామాలో సంప్రదించాలి.

శ్రీ పొన్నలూరు సీతారామ రెడ్డి అధ్యక్షతన పనిచేసే సేవా సంస్థ ఇది.


**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. 75.00 |
| ఆరు నెలలకు | రూ. 40.00 |
| విడి ప్రతి | రూ. 1.50 |


## నెల్లూరు ప్రిన్సిపల్ మున్సిఫు వారి కోర్టులో

OP 3/92

1. పోతురాజా రమేష్
2. పోతురాజా వెంకట రమణమ్మ

మైనర్లు అయినందువలన వారి యొక్క పోషణ కర్త మరియు తాత పోతురాజా వెంకయ్య – పిటీషనర్లు జంగవాని దొరువు కాపురస్తుడు పోతురాజా వెంకటేశ్వర్లు చనిపోయినందున ఆయన యొక్క వారసులమని పిటీషనర్లు పై దావా వేసి యున్నారు. కావున ఎవరికైనా ఆక్షేపణలున్న యెడల 11.5.92 తేది ఉదయం 10 గంటలకు పై కోర్టు ఎదుట ఆక్షేపణలు తెలుపు కొనవల సినది. లేని యెడల పరోక్షమున తీర్మానింపబడునని తెలియ జేయడమైనది.

V. ఉపేంద్ర

పిటీషనర్ల తరపు అడ్వొకేటు, నెల్లూరు



## నెల్లూరు మూడవ అదనపు మునసబు గారి కోర్టులో

IA 630/91/OS 501/89

సిండికేటు బ్యాంకు, బ్రహ్మదేవం — పిటీషనరు

Vs

పెదకల పెదనరసింహం వగైరా — రెస్పాండెంటు

To,

పెదకల పెదనరసింహం

S/o. వీరయ్య, నేలటూరు గ్రామం

ముత్తుకూరు మండలం, నెల్లూరు జిల్లా

పై నంబరున పిటీషనరు Final Decree కోరుచూ పిటీషను దాఖలు చేసినందున వాయిదా నిమిత్తం 17.6.92 వేసి వున్నారు. ఆ దినం మీరు గాని మీ తరపు వకీలు గాని హాజరయి ఆక్షేపణలు తెలుపకున్న దావా పరోక్షంలో తీర్మానించబడును.

M. రవీంద్రరెడ్డి

పిటీషనరు తరపు వకీలు

## ఒంగోలు 1వ అదనపు డిస్ట్రిక్టు మునసబు వారి కోర్టులో

EP 194/90 in 168/79

యామని వెంకాయమ్మ — DHR

యామని కోటయ్య — JDR

యీ క్రింద తెలిపిన షెడ్యూలు ఆస్తి పై కోర్టు వారి యెదుట 15.6.92 తేది వుదయం 10.30 నుంచి పాలం వేలం పాట జరుగును. కావలసిన వారు వేలం పాటలో పాల్గొని పాటలు పాడుకొనవచ్చును.

### షెడ్యూలు

ప్రకాశం డిస్ట్రిక్టు రిజిస్ట్రేషన్ ఒంగోలు సబ్.రిలో చేరిన పెళ్లూరు గ్రామంలోని ఆస్తి

1. పెళ్లూరు గ్రామం సర్వే 433/1 యం. 72 ట్లలో 0.34 ట్లు లేక 138 హె. హద్దులు. తూర్పు: యామని వెంకటేశ్వర్లు భూమి వగైరాలు; ద: పంట కాల్వ; ప: గలగాడి శ్రీరాములు భూమి; వు: యీ నంబరులోని యామని వెంకటేశ్వర్లు భూమి – వారి క్రయం Rs. 1700/JDR వ్యాల్యు Rs. 4000/-

అమీనా క్రయం — Rs. 5100/-

2. EP షెడ్యూలు 7వ ఐటం – డిటో గ్రామం సర్వే 285/2 యం. 34 ట్లు లేక - 138 హె. హద్దులు– తూ: యామని వెంకటేశ్వర్లు; ద: అవుల సుబ్బమ్మ; ప: యామని రాఘవయ్య; వు: యామని వెంకటేశ్వర్లు వారి క్రయం Rs. 1700/- JDR వ్యాల్యు Rs. 4000/- అమీనా క్రయం Rs. 1700/-

వేలం వాయిదా — 15.6.92

వరదర్ హియరింగు — 22.6.92

యడపల్లి వెంకట శేషయ్య

DHR తరపు అడ్వొకేటు

జిల్లావార్తలు — జిల్లావార్తలు — జిల్లావార్తలు — జిల్లావార్తలు

# కృష్ణాపట్నం థర్మల్ స్టేషన్‌కు త్వరలో మోక్షం!

కృష్ణాపట్నం థర్మల్ స్టేషన్ నిర్మాణ పనులపై అధ్యయనం జరిపేందుకు థర్మల్ పవర్ అప్రైజల్ కమిటీ త్వరలో నిర్ణయం తీసుకుంటుంది. అనుమతులు. పర్యావరణ శాఖ నుంచి క్లియరెన్స్ రాగానే ఈ పనులు ప్రారంభమౌతాయి. కావలి సభ్యుడు శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి ప్రధాన మంత్రికి వ్రాసిన జాబుపై కేంద్ర పవర్ శాఖ జాయింట్ సెక్రటరీ ఆర్.కె. నాయర్ సమాధానం వ్రాస్తూ ఈ విషయం తెల్పారు. కేంద్ర ఇంధన శాఖ అడిగిన వివరాలన్నీ ముఖ్యమంత్రి సమర్పించారని; ఇందుకోసం ప్రత్యేక కమిటీని పంపే ప్రతిపాదన పరిశీలనలో వుందని శ్రీనాయర్ తెలియజేశారు. సోమశిలలో థర్మల్ కేంద్రం స్థాపించే ప్రతిపాదన ఏదీ లేదని కూడా చెప్పారాయన.

సోమశిలలో 5 మెగావాట్ల థర్మల్ కేంద్రం పెట్టాలనే ప్రతిపాదన ఇదివరకు వుండింది. అయితే ఉత్పత్తి ఖర్చు గిట్టుబాటు కానందువల్లనో, లేక అంత చిన్న కేంద్రం నిర్వహణ కష్టతరమనుకున్నారో ఏమో ఆ ప్రతిపాదన విరమించుకున్నట్లున్నారు.

## బూదవాడ ఎన్నికలో ఎం.వి. విజయం!

మర్రిపాడు మండలం బూదవాడ ప్రాథమిక సహకార పరపతి సంఘం పాలక వర్గ ఎన్నికల్లో మండలాధ్యక్షుడు శ్రీ ఎం.వి నారాయణ రెడ్డి వర్గీయులు విజయం సాధించారు. అధ్యక్షుడుగా శ్రీమల్లు రమణారెడ్డి, ఉపాధ్యక్షుడుగా శ్రీ గోపవరం చలమారెడ్డి ఎన్నికయ్యారు. ఎన్నిక ఏకగ్రీవం.

ఉదయగిరి రాజకీయంలో విశేష ప్రాధాన్యత పొందిన సొసైటీ ఎన్నిక ఇది. శత్రువులుగా మారిన మాజీ మిత్రులు శ్రీ ఎం. రాజమోహన్ రెడ్డి, శ్రీ ఎం.వి నారాయణ రెడ్డిల మధ్య లడాయి పెట్టిన ఎన్నిక కావడంతో ఫలితం కోసం తాలూకా వారంతా ఎదురు చూచారు. ఈ ఇద్దరి స్వగ్రామాలు - బ్రాహ్మణపల్లె, కంప సముద్రం ఈ సొసైటీలోనివే! సహకార ఎన్నికల సమయంలోనే పోలింగు జరిగినా, ఫలితం ప్రకటించ కుండా రాజమోహనరెడ్డి స్టే తెచ్చారు. కోర్టు ఉత్తర్వులన్నీ రద్దయిన తర్వాత జరిగింది ఎన్నిక.

దీనితో రాజమోహన్‌రెడ్డికి ఇక రాజకీయ జీవితమే లేదనే దురభిప్రాయంలో వున్నట్లున్నారు. నారాయణ రెడ్డి వర్గీయులు. రాజకీయంలో విజయం, అపజయం రెండూ తాత్కాలిక మైన వేననే చారిత్రక సత్యాన్ని విస్మరించడం క్షేమం కాదండీ, నారాయణ రెడ్డిగారూ!

## వాసిలి సర్పంచ్ మరణం

ఆత్మకూరు తాలూకా వాసిలి గ్రామ సర్పంచ్ శ్రీ చింతల నారయ్య 6తేది మరణించారు. వడదెబ్బ, ఆపై గుండెపోటు చావుకు కారణమట.

నారయ్య అరుంధతీయుడు, మాజీ సైనికోద్యోగి. గ్రామంలో అందరి అభిమానమూ పొందినవాడు. అంతిమ సంస్కారం అతడి పట్ల గ్రామస్తుల అభిమానానికి నిదర్శనంగా జరిగింది.

## తుమ్మగుంట శంకర జయంతి

తుమ్మగుంట అయ్యప్ప స్వామి దేవాలయంలో ఇటీవల శంకర జయంతి జరిగింది. పూజ కంచి స్వామి ప్రసాదించిన చిత్రపటాల ఆవిష్కరణ చేశారు. శ్రీ బి. పట్టాభిరామయ్య ఈ కార్యక్రమ నిర్వాహకుడు.

## గూడూరు ఆస్పత్రి

గూడూరు ఆస్పత్రికి అదనంగా మంజూరైన 40పడకలను పాత 30పడకల మధ్య ఇరికించి, అభివృద్ధిని అపహాస్యం చేస్తున్నారని ఒక ఆరోపణ.

గూడూరులో ఇప్పటి వరకు 30పడకల ఆస్పత్రి మాత్రమే వుంది. ముఖ్యమంత్రి దాన్ని 70పడకల స్థాయికి అప్‌గ్రేడ్ చేయించారు. దీనికి తగ్గట్లు పరికరాలు, పోస్టులు మంజూరైనాయి. కాని భవనం మాత్రం మారలేదు. వున్న భవనంలో కొత్త పడకలు సర్దడం వల్ల ఇరుకైపోయింది. అసౌకర్యంతో సౌకర్యాల ననుభవించవలసి రావడం రోగులకు కొత్త అనుభవం. డాక్టర్ రామసుబ్బారెడ్డి గారు, కొంతకాలం ఈ అసౌకర్యం తప్పదని చెప్తున్నారు.

## పెంచలకోన బ్రహ్మోత్సవాలు

పెంచలకోన బ్రహ్మోత్సవాలు 13తేది నుంచి జరుగునున్నాయి. భక్తుల రద్దీ తట్టుకోవడం కోసం 170 స్పెషల్ బస్‌లు నడుపుతున్నది ఆర్.టి.సి., రాపూరు, వెంకటగిరి, నెల్లూరు ఆత్మకూరు, గూడూరు, కడప వంటి ప్రాంతాలన్నింటి నుంచీ ఈ బస్సులు నడుస్తాయి.

## చేజర్ల చెరువుకు ఈ ఏడాదే సోమశిల నీరు

సోమశిల ప్రాజెక్టు దక్షిణ కాలవపనులు త్వరితంగా పూర్తి చేయించి ఈ ఏడాది ఆఖరులోగా చేజర్ల మండలంలోని చెరువులన్నింటి లోకి నీరు విడుదల చేయిస్తానని గనుల మంత్రి శ్రీ మాదాల జానకి రాం హామి ఇచ్చారు. ఇందుకోసంగా దక్షిణ కాలువ పనులకు అధిక నిధులు విడుదలయ్యేట్లు చూస్తానన్నారు కూడా! పెన్నానది నుంచి చేజర్లకు వచ్చే గంగిరెడ్డి కాలువ, కొత్తకాలువ, మాముడూరు కాలువ, పెరుమాళ్ళ కాలువలను సోమశిలలో కల్పకుండా పిడబ్ల్యుడి శాఖ స్వంతంగా నిర్వహిస్తుందని చెప్పారు.

చేజర్లలో మంత్రికి గత నెల 24తేది ఘన సన్మానం జరిగింది. మండలాధ్యక్షుడు శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు, ప్రభుత్వ విప్ శ్రీ సి.వి. శేషారెడ్డి, మార్కెటింగ్ సొసైటి అధ్యక్షుడు శ్రీ తాళ్ళూరు రమణయ్య నాయుడు తదితరులు మాట్లాడారు. సోమశిల ఎస్. శ్రీ డి. రామిరెడ్డి, భూసేకరణకు గాను ఇంకా 6కోట్లు కావలసి వుందని, 7వేల ఎకరాలు సేకరించవలసి వుందని చెప్పారు.

7వేల ఎకరాలకు 62 కోట్లంటే ఎకరాకు 88వేలు;అంతంత పరిహారం చెల్లిస్తున్నారా?

## వెంకటగిరి ఎమ్మార్వో కోర్టు అమీనా వివాదం

వెంకటగిరి ఎమ్మార్వో శ్రీ జి.వి.సుబ్బారావు మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టు అమీనా టి.ఎస్. ఆంజనేయులు స్వల్ప విషయంలో గొడవ పడి ఒకరిపై ఒకరు పోలీసులకు ఫిర్యాదు చేసుకున్నారు. ఏదో కేసుకు సంబంధించి ఎంఆర్‌ఓ కు సమన్ జారీ చేయడం కోసం అమీనా వెళ్ళాడట; అయితే ఆఫీసు అటెండరు , దాన్ని తనకిస్తే కొదవ 6 పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.